# సహకారం అందించండి !

## శ్రీవాణి ని ప్రోత్సహించండి!

ఆర్థిక స్తోమతగల వదాన్యులు జీవిత సభ్యులు (రు. 500-00) గా చేరడం ద్వారాను, అవకాశం వున్నవారు నాలుగు సంవత్సరాల చందా (రు. 116-00) పంపడం ద్వారాను, కనీసం ఒక సంవత్సర చందా (రు. 36-00) అయినా కట్టి సహకారం అందించి శ్రీవాణి ని ప్రోత్సహించ ప్రార్థన. జీవిత సభ్యుల ఫొటోలు శ్రీవాణిలో ముద్రించబడతాయి. చందాలు మాత్రం D. D ద్వారా గాని, M O ద్వారా గాని పంపి సహకరించ ప్రార్థన. జీవిత సభ్యులు 'చెక్' ద్వారా పంపినా ఫరవాలేదు. D. D. మరియు 'చెక్' ల మీద 'Sreevani, monthly' అని వ్రాయవలెను.

"తమరందించే సహకారం ; సాహిత్య, సాంస్కృతిక, ఆధ్యాత్మిక ప్రచారానికి ప్రోత్సాహం"

— సం.

## క్రొత్త సీరియల్

శ్రీవాణి పాఠకులకు వచ్చే నెల నుంచి

"యంగ్‌టర్క్" సమర్పించిన

సరిక్రొత్త కానుక

### "ఛేజింగ్"

సీరియల్ నవల ప్రారంభం

* పట్టపగలు సినిమాహాలులో హత్యలు !
* హంతకుడెవరు ?
* ఆద్యంతం సస్పెన్సుతో ముంచెత్తే సరిక్రొత్త సస్పెన్స్ నవల !

- సం.

## జ్యోతిషవాణి

గత ఒకటిన్నర సంవత్సరాలుగా శ్రీవాణిలో 'జ్యోతిషవాణి' శీర్షికను విజయవంతంగా నిర్వహించిన "దైవజ్ఞరత్న, వాస్తు జ్యోతిష విద్వాన్" శ్రీ కవితా కామేశ్వరశర్మగారికి కృతజ్ఞతాభివందనలు. ఈ సంచిక నుండి 'జ్యోతిషవాణి' శీర్షికను నిలుపుదల చేస్తున్నాము. ఈ విషయమై అవసరమైన సలహాలను శ్రీ కవితా కామేశ్వరశర్మ (అవనిగడ్డ 521 121, కృష్ణాజిల్లా) గారితో ఉత్తర ప్రత్యుత్తరములు నేరుగా జరిపి పొందవచ్చును. ధన్యవాదములు -సం

మే - 1987

సంపుటి : 3

సంచిక : 5

# శ్రీవాణి

సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకుడు-కొమరగిరి కృష్ణమోహనరావు

మేనేజర్
కొమరగిరి చంద్రశేఖర్
24-51 రామానాయుడు పేట
మచిలీపట్నం-521 001
ఫోన్ : 2818

విడి ప్రతి : రు. 3-00
సంవత్సర చందా : రు. 36-00
2 సం॥ల చందా : రు. 66-00
4 సం॥ల చందా : రు. 116-00
జీవిత సభ్యత్వం : రు. 500-00

Cheques & Drafts should be drawn in favour of SREEVANI, Monthly Machilipatnam

EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at
SPANDANA PRINTERS
MACHILIPATNAM

## విషయ సూచిక



ముఖచిత్రం : మహారాణా ప్రతాప్

## సంపాదకీయం

# విద్యాలయాలు - దేవాలయాలు

మన రాష్ట్ర ప్రభుత్వం విద్యాలయాలు, దేవాలయాలమీద కొన్ని అంశలను విధిస్తూ చట్టాలను చేసింది పూర్వాపరాలను కూలంకషంగా చర్చించకుండా వీటికి సంబంధించినవారితో చర్చలు జరపకుండా ప్రభుత్వం తొందరపడిందనడంలో ఏమాత్రం సందేహం లేదు. ఇటువంటి ప్రధాన సమస్యలమీద చర్చలు విస్తృత ప్రాతిపదికమీద జరపడం సముచితం. ఆ విధంగా చేయకుండా తొందరపడి చట్టాలను రూపొందించినయెడల మేలు చేకూరకపోగా నష్టం ఎక్కువ మందికి కలగడం సహజం. తొందరపాటుతనం వలన ఆశించిన ఫలితాలు చేకూరకపోగా, దుష్పరిణామాలను ఎదుర్కొనవలసి వస్తుంది. సహజంగా ఏ ప్రభుత్వమైనాసరే ప్రజలకు న్యాయం చేకూర్చాలనే భావిస్తుంటుంది. అయితే ఒక ప్రక్క వాదననే విని నిర్ణయాలు గైకొనడం జరుగుతుంటుంది. ఇదే యిప్పుడు జరిగింది. దేవాలయాల అర్చకులు వీధిన పడ్డారు. ఆందోళనలు చేస్తున్నారు. న్యాయస్థానాలకు వెళ్ళడానికి అయిత్తమవుతున్నారు. ప్రయివేటు విద్యాలయాల వారు కూడా తీవ్రమైన ఆందోళనకు గురైనారు.

విద్యాలయాల విషయాలను పరిశీలిద్దాం. మన రాష్ట్రంలో సుమారు 1/3 మంది బాలబాలికలు ప్రయివేటు విద్యాలయాలలో చదువుతున్నారు. ప్రభుత్వ అధీనంలో నున్న విద్యాలయాలలో చదివే బాలబాలికల కన్నా అత్యధిక శాతం ప్రయివేటు విద్యాలయాలలో చదివేవారే ఉత్తీర్ణులవుతున్నారు. దీనికి కారణమేమిటో ప్రభుత్వంకూడా ఆత్మవిమర్శ చేసుకోవాలి. ట్రయినింగ్ పొందిన ఉపాధ్యాయులున్నప్పటికీ, ఉచితంగా చదువు చెబుతున్నప్పటికీ, పేదలకు ఉచితంగా వస్త్రములు, పుస్తకములు యిస్తున్నప్పటికీ, కొంతకాలం మధ్యాహ్న భోజన పథకమును అమలుపరచినప్పటికినీ తమ పిల్లలను ప్రభుత్వ అధీనంలో వున్న విద్యాలయాలకు పంపించకుండా, ఫీజులు చెల్లించి, ప్రయివేటు విద్యాలయాలకు పంపించవలసిన అవసరం ఏమిటి? ఈ విషయమైకూడా ప్రభుత్వం పరిశీలించవలసిన అవసరం వున్నది. ఇటువంటి మౌళికమైన విషయాలను క్షుణ్ణంగా పరిశీలించకుండా, తొందరపడి ప్రయివేటు విద్యాలయాలపై నియమనిబంధనలు విధిస్తూ ప్రభుత్వం చట్టం చేయడం శోచనీయం. ఒక విషయంలో మాత్రం ప్రభుత్వాన్ని ప్రశంశించవలెను మార్చి 9వ తేదీన ఈ బిల్లు శాసనసభలో చర్చకు వస్తున్న సమయంలో 8వ తేదీన గౌ ముఖ్యమంత్రిగారి ప్రమేయంతో ఆంధ్రప్రదేశ్ ట్యుటోరియల్స్ అండ్ కాన్వెంట్స్ అసోసియేషన్ ప్రతినిధులతో అధికారులు చర్చలు జరపడం మాత్రం ముదావహం తత్ఫలితంగా ఆరు అధికార సవరణలను ప్రభుత్వమే ఈ బిల్లుకు తీసుకొనివచ్చింది. ఈ విధంగా జరగడానికి కారణమేమిటి? అసోసియేషన్ ప్రతినిధుల వాదనలో కూడా కొంత న్యాయం వున్నదని ప్రభుత్వ అధికారులు భావించడంవలననే ఈ సవరణలు వచ్చాయి ఇదే ఇంకా కొంచం ముందుగా జరిగివున్నట్లయితే ఈ బిల్లు ప్రవేశపెట్టబడి వుండేదే కాదేమో? ఈ అనుభవాన్ని పురస్కరించుకొని జి.ఓ. లను జారీ చేసేముందు అసోసియేషన్ ప్రతినిధులతో

వివరంగా చర్చలు జరపడం సముచితం. ఆ విధంగా చేయకుండా ప్రభుత్వం ఏకపక్షంగా జి. ఓ. లను జారీచేస్తే నష్టపోయేది విద్యార్థులే అవుతారు. వారలకు సీట్లు చూపించలేక ప్రభుత్వం అనేక యిక్కట్లను ఎదుర్కొనవలసి వస్తుంది. ప్రయివేటు విద్యాలయాలు మూతపడి, వాటిల్లో పనిచేస్తున్న వేలాదిమంది ఉపాధ్యాయులు నిరుద్యోగులవుతారు. చిట్టచివరికి మెరిట్ కూడా దెబ్బ తింటుంది. ఉత్తీర్ణుల శాతం పడిపోతుంది. విద్యారంగంలో సంక్షోభం ఏర్పడుతుంది. కనుక ఈ విషయంలో ప్రభుత్వం విజ్ఞతను ప్రదర్శించాలి వేలాది రూపాయిల డొనేషన్లు వసూలు చేస్తున్న విద్యాలయాలను అరికట్టాల్సిందే. అదెవరూ కాదనరు. ఆ సాకుతో చిన్నచిన్న విద్యాలయాలను దెబ్బతీయడం మాత్రం విజ్ఞత అనిపించుకోదు. అనేకమంది ఉన్నత విద్యను చదివి, ఉద్యోగాలు దొరకక ప్రయివేటు విద్యాలయాలను నెలకొలిపి, తాము పోషించుకుంటూ, వేలాదిమంది విద్యావంతులైన నిరుద్యోగులను పోషిస్తున్నారు. ప్రభుత్వం చేయలేని పనిని వీరు చేస్తుంటే 'పుట్టగొడుగు'ల్లా విద్యాలయాలు వెలుస్తున్నాయని మంత్రివర్యులు తరచుగా విమర్శిస్తూండటం కడు విచారకరం. ప్రభుత్వం పూర్వాపరాలను విచారించకుండా, అవాస్తవికమయిన, అనాలోచితమయిన నియమనిబంధనలను తొందరపడి జి. ఓ ల రూపంలో జారీచేస్తే ప్రయివేటు విద్యాసంస్థలు మూతపడుతాయి. ఆర్థికసంక్షోభంలో కొట్టుమిట్టాడుతున్న ప్రభుత్వంపై మరింత ఆర్థికభారం పడుతుంది కనుక ప్రభుత్వం ఈ విషయమై విజ్ఞతను ప్రదర్శించడం సముచితం.

ఇకపోతే దేవాలయాల విషయం పరిశీలిద్దాం ఇది చాలా సున్నితమైన విషయం. అందులో మత సంబంధమైన విషయం. ఈ రంగంలో కొంతమంది పలుకుబడి గల వ్యక్తులు, దేవాలయాల భూములను ఆక్రమించుకొని యివ్వవలసినంత కౌళ్ళు చెల్లించకుండా, ఏళ్ళ తరబడి అనుభవిస్తూ, దేవుని సొమ్మును స్వాహా చేస్తున్నారు. అట్టివారిని శిక్షించవలసినదే. అట్టివారివద్ద నున్న భూములను తీసుకొని, బహిరంగ వేలం ద్వారా కౌళ్ళను వసూలు చేయాల్సిందే. దీనిని ఎవరూ కాదనరు అది చేయకుండా దేవాలయాల భూములను అమ్మి ట్రెజరీకి జమ కట్టాలని నిర్ణయించడం మాత్రం ఏమాత్రం విజ్ఞత అనిపించుకోదు. చరాస్తులు వుండవని ఆనాడు దాతలు భావించి, దేవాలయాలకు స్థిరాస్తులను ఏర్పర్చారు, ఇప్పుడు దానిని ప్రభుత్వం మార్చివేస్తున్నది. భవిష్యత్తులో నాస్తిక ప్రభుత్వం వస్తే రావచ్చును. అప్పుడు ఈ నగదును మరొక దానికి వినియోగించవచ్చును ఏనాడో దానం చేసిన దాతల పరమావధి బూడిదలో పోసిన పన్నీరే గదా! వంశపారంపర్య హక్కు వుండరాదంటున్నారు రాజకీయాలలో మాత్రం వుండవచ్చునా? అధికారంలో నున్నవారికి మాత్రం ఇది వర్తించదా? అర్చకులకేనా? ఇది ఏమాత్రం సబబు కాదు. మంత్రతంత్రాలు రాని అర్చకులకు కొంత వ్యవధి యివ్వాలి. ఈలోగా అందులో ప్రావీణ్యతను సంపాదించుకోవడానికి అవకాశం యివ్వాలి అది చేయకుండా అర్చకులనుకూడా ఉద్యోగులుగా మార్చివేస్తే అరిష్టం ఏమిటో ప్రభుత్వం గమనించినట్లు లేదు ఉద్యోగులుగా గుర్తించినప్పుడు, స్కేలు ప్రకారం జీతం యివ్వాలి, శలవలు యివ్వాలి ప్రావిడెంట్ ఫండ్, పెన్షన్ వగయిరాలన్ని చెల్లించవలసివస్తుంది. అప్పుడు డబ్బు చాలదు అర్చకులుకూడా వారి హక్కులకోసం పోరాటం చేస్తారు, సమ్మెలు చేస్తారు. పవిత్రములైన దేవాలయాలు మూతపడుతాయి. అప్పుడు దేవునికి, అర్చకునికి మధ్యనున్న పవిత్రమైన సంబంధం తెగిపోయి; ప్రభుత్వం, ఉద్యోగికి మధ్య నున్న సంబంధంగా మారిపోతుంది. ఇది అత్యంత ప్రమాదం. ఈ విషయాలన్నింటినీ మతపెద్దలతో, పీఠాధిపతులతో, ధర్మకర్తలతో, అర్చకులతో చర్చించకుండా ప్రభుత్వం ఏకపక్షంగా చట్టం తీసుకొనిరావడం శోచనీయం.

విద్యాలయాలు, దేవాలయాల విషయంలో ప్రభుత్వం విజ్ఞతను ప్రదర్శించకుండా, మొండిగా, ఏకపక్షంగా వ్యవహరిస్తే రానున్న సంక్షోభానికి ప్రభుత్వమే పూర్తిగా బాధ్యత వహించవలసివస్తుంది.



శ్లో॥ ఉద్యోగినం పురుషసింహ ముపైతి లక్ష్మీః
దైవేన దేయమితి కాపురుషా వదంతి
దైవం నిహత్య కురు పౌరుష మాత్మశక్త్యా
యత్నే కృతే యది న సిద్ధ్యతి కోఽత్రదోషః ? ॥

లోకంలో రెండు రకాల మనుష్యులున్నారు, ఒకరు కేవలం దైవంమీదే ఆధారపడి స్వయంకృషి చేయకుండా కాలం గడిపేవారైతే మరొకరు స్వయంకృషినే నమ్ముకొని జీవనం గడుపుతారు. దైవం పేరెత్తరు.అంటే అదృష్టం కోసం యెదురుచూస్తూ పని చేయకుండావుండే రకం మనుష్యులు కారన్నమాట.




సత్యదృష్టితో పరికిస్తే స్వయంకృషికంటే గొప్పది లేదు. ఉద్యోగమంటే నౌకరీ కాదు. ప్రయత్నశీలమని అర్థం. ఎప్పుడూ ఏదో పని చేస్తూవుండే మనిషిని ఉద్యోగి అంటారు ఏ రంగంలోనైనా మనిషి అభ్యుదయం కోసం నిరంతరం చేసే ప్రయత్నం ఉద్యోగం. అలా ప్రయత్నంతో అంటే స్వయంకృషితో లేక వుద్యమంతో జీవనం సాగించే వ్యక్తిని సంపద వరిస్తుంది. సోమరి కాకుండా ఏదో వొక విధమైన ప్రయత్నం కొనసాగించే ధీరుడికి తప్పక సంపదలు వాటంతట అవే సంప్రాప్తమవుతాయి. వాడే నిజంగా పురుషుడనిపించుకుంటాడు అందుకనే లోకంలో "ఉద్యోగం పురుష లక్షణం" అనే నానుడి వచ్చింది. ఇది కర్మ సిద్ధాంతానికి కావలసిన ప్రధాన లక్షణం.

అలాకాక ప్రతిదానికీ దైవం దైవం అంటూ ఏ ప్రయత్నమూ లేక అదృష్టంకోసం యెదురు చూస్తూ కూర్చోటం మంచి లక్షణం కాదు అట్లా అనేవాళ్ళంతా చెడ్డ మనుష్యులు, నీచ బుద్ధులు. అలాంటి భావంతో కర్మదూరులయిన వాళ్లే సోమరులవుతారు సోమరితనంవల్ల దేశం ప్రగతిపథంలో పయనించలేదు. ఈ భావం దేశానికి అరిష్టం

అందుచేత ప్రతివ్యక్తీ అదృష్టంమీద ఆధారపడకుండా స్వశక్తినే నమ్ముకొని కృషి చేయవలసివుంది. ఇక్కడ దైవమంటే భగవంతుడనీ, ఆ భగవంతుని లెక్క చేయకూడదనీ కాదు దీని భావం. దైవమంటే అదృష్టం. "ఎలా కావాలసివుంటే అలా అవుతుంది. అంతా మన అదృష్టంమీద ఆధారపడివుంది." అనే విధమైన ఆలోచనా సరళి దైవంగా యిక్కడ భావించబడింది ఈ భావన మనిషిలో సోమరితనాన్ని పెంచుతుంది. దానివల్ల దేశానికి దారిద్ర్యం కలుగుతుంది. కనుక మొట్టమొదట నీ ధర్మంగా భావించి పని చెయ్యి. అదృష్టం విషయం ఆలోచన చేయకుండా స్వయంకృషితో ముందుకు సాగు. అనే ప్రబోధం యిందులోని సారాంశం

అయితే ఎంత స్వయంకృషి చేసినా కార్యసిద్ధి కలగకపోతే యెలా ? అని నిరుత్సాహ పడరాదు మన లోపం లేకుండా పని చేయటమే మన విధిగా భావించాలి ఒకవేళ ఫలితం కలగకపోతే నష్టమేముంది ? ఏం పరవాలేదు. అలా అని కృషి మానుకోటం తెలివిమాలిన పని.

ఎంత సింహమైనా స్వయంకృషితో వేటాడకుండా నోరు తెరుచుకొని పడుకుంటే మృగాలు తమంతట తామే వచ్చి దానినోట్లో పడవు కదా ! కనుక ప్రతివాడు వుద్యమించితే సంపదలవే సమకూరుతాయి.



# స్వతంత్ర శంఖారావం పూరించిన వీరమూర్తి

# మహారాణా ప్రతాప్

**పరివర్తిని సంసారే మృతఃకోవాన జాయతే**
**సజాతో యేన జాతేన యాతి వంశస్సమున్నతమ్ –**

సంసారసృష్టి ఎప్పుడూ చక్రంలా తిరుగుతూనే ఉంటుంది. మరణించిన ప్రతి ప్రాణీ తిరిగి పుడుతూనే ఉంటుంది. కాని ఎవరి జన్మవల్ల వంశం కీర్తిదీప్తులతో ప్రకాశిస్తుందో వాని జన్మే సార్థకమైనది అంటాడు భర్తృహరి.

16 వ శతాబ్దం భారతదేశానికి ఒక పీడ కల. టర్కీ దేశస్థుడైన బాబర్ భారతదేశం మీదికి దాడి చేసి ఉత్తర భారతంలో అఫ్ఘనిస్తాన్ నుంచి బీహార్ వరకొక వైపూ, హిమాలయాల నుండి గ్వాలియర్ వరకున్నూ తన రాజ్యాన్ని విస్తరించాడు. అతని కుమారుడు హుమాయూన్ పర్ష్యా సామ్రాట్టు సహాయంతో కాలు నిలవ దొక్కుకొని, అధికారాన్ని నిలుపుకొన్నా హఠాన్మరణంతో ఎక్కువకాలం తన ప్రభుత్వాన్ని నిలుపుకోలేకపోయినాడు. అతని తర్వాత అక్బరు 1556 లో ఢిల్లీ సింహాసనాన్ని చేజిక్కించుకున్నాడు.

అప్పటికే ఉత్తర భారతంలో క్షాత్రశక్తి అలసిపోయింది. హిందూ రాజులలో ఐక్యత నశించింది. భారత చరిత్రలో ఒక అగ్నిగర్భంలా జీవించిన రాజపుత్ర స్థానం ఆత్మవిశ్వాసాన్ని కోల్పోయింది. 7 వ శతాబ్దం నుండి ఎడతెగకుండా సాగిన విదేశ దండయాత్రల పరంపరను ఎదుర్కొంటూ యుద్ధజ్వాలల్లో పురుషులు ఆత్మాహుతులను కలుస్తుంటే, స్త్రీలు పరాయి పిశాచ కామానికి బలి కాకుండా, అగ్ని ప్రవేశంలో ఆత్మాభిమానాన్ని కాపాడుకుంటూ, భారతీయ స్త్రీ జీవన పావిత్ర్యాన్ని కాపాడుతూ వచ్చారు. కాని ఈ దీర్ఘ పోరాటం సామాన్యునికి దుస్సహమైంది.

జయపూర్ రాజైన బిహారీమల్, అతని కుమారుడు భగవాన్‌దాస్ అక్బరుకు దాసోహమన్నారు. అతని కుమారుడు మానసింగ్ తన కుమార్తె జోధ్‌బాయిని అక్బరు కిచ్చి వివాహం చేశాడు. మిగతా రాజపుత్రులు గూడా క్రమంగా అక్బరు ఆధిపత్యాన్ని స్వీకరిస్తూవచ్చారు.

**భండారు సదాశివరావు**

అక్బరు చతురుడు. భారతదేశంలో ఆంగ్లేయులు ప్రారంభించిన "విభజించి పాలించు" వ్యూహం అక్బరు విధానంలోంచి నేర్చుకున్నదే నంటారు చరిత్రవేత్తలు. భారతీయ ఆత్మ గౌరవాన్ని నిలబెట్టుకునే అంతశ్శక్తిని, అభిమానాన్ని దెబ్బతీస్తే, ఈ జాతి నిస్తేజమవుతుందని అతడు గుర్తించాడు. ఇస్లాం మత ప్రచారానికి రాచబాట ఉదారవాదాన్ని ప్రచారం చేయడమేనని గ్రహించిన అక్బరు, రాజపుత్రుల అభిమానాన్ని దెబ్బ తీయడానికే వివాహ సంబంధాలను, ఏకముఖంగా కొనసాగడానికి ప్రోత్సహించాడు. మతపరంగా ఆత్మ స్థైర్యం కోల్పోయి పూర్తిగా ఇస్లాంను స్వీకరించడానికి మానసికంగా సిద్ధం కాని హైందవజాతిని, మతాంతరీకరణం చేయడానికి దీన్ ఇలాహీని ప్రారంభించాడు. ఒక విధంగా దేశ ధర్మ స్వాతంత్ర్యాలను కాపాడడానికి, ఈ విదేశ దురాక్రమణల వలయాన్ని ఛేదించడానికి పరాయి పాలనకు ఎదురు నిల్చి, స్వేఛ్ఛాస్వాతంత్ర్యాలను కాపాడుకోడానికి అవసరమైన ధైర్యం, కష్టసహిష్ణుత, నిరంతర పోరాటం కొనసాగించ

డానికి, అవసరమైన మానసిక స్థితి బలహీనమవుతూ వచ్చాయి.

అక్బరు టర్కీ దేశస్థుడు. ప్రపంచ చరిత్రలో పరమ కిరాతకాలను, అమానుష మానవ సంహారాలను రచించిన చెంగీజ్‌ఖాన్ - తైమూర్ వంశాల వారసుడు. అందుకే ఇతర జాతుల ఇస్లాం రాజులను కూడా అతను సహించలేదు. ఈ భయానక పరిస్థితిలో జాతి స్వాంతంత్ర్యేచ్ఛను, స్వరాజ్య పిపాసను కాపాడవలసిన అవసరం ఒక మహా తపస్సుగా నిలిచింది.

జయాపజయాలు దీర్ఘ కాల చరిత్రలో ఏ దేశంలోనైనా తటస్థమవుతూనే ఉంటాయి. వాని కార్య కారణాలను తర్కించుకోవడం అవసరమే. కాని ఈ జయాపజయాల గర్భంలో దాగి నిలిచే కొన్ని వాస్తవాలను ఆయా జాతుల జీవనానికి నిత్యమూ మననీయంగా పారేయంగానూ నిలుస్తాయి. అలాంటి వాస్తవాలనే దేశపు అతి సంకట పరిస్థితిలో రాజపుత్రస్థానంలో శిశోదియా వంశం సృష్టించింది.

మహారాజ బాప్పారావల్ వెలిగించిన ధర్మవీర పతాకానికి మేవాడ్ – చిత్తోడ్ రాజులు ఆధార స్తంభాలైనారు. వారు క్షాత్ర కుల గురువులు. ఆ నేలన పుట్టిన ప్రతి బాలుడూ ఒక అగ్నిగోళం. అక్కడ పుట్టిన ప్రతి బాలికా ఆత్మాభిమాన జ్వాల.

శిశోదియా వీరులకు ప్రాణాలు తృణప్రాయాలు. స్వాతంత్ర్యం కొరకు తరతరాలుగా బలి అయిపోతూ వచ్చారే గాని శత్రువు ముందు తల దించలేదు చిత్తోడ్ మీద శత్రువుల దాడులు జరిగినప్పుడల్లా, పోరాడినంతసేపు పోరాడి, కోట తలుపులు తెరచి కషాయ వస్త్రాలతో, కషాయ ధ్వజాలతో తమ కులదైవమైన 'ఏకలింగ' స్వామికి జయకారాలర్పిస్తూ పౌరుష దివ్య కాంతులను వెదజల్లుతూ ప్రళయతాండవంచేసి ప్రాణాలర్పించారేగాని, బానిసత్వాన్ని స్వీకరించలేదు. అలాగే వేలకొలది రాజపుత్రరమణులు "జౌహార్" చేసి, స్వయంగా తమకై తాము చితాగ్నిలోపడి, శత్రుపిశాచ కామాన్ని అపహసిస్తూ, అగ్నిగర్భంలోలీనమైనారే గాని, అవమానానికి గురికాలేదు.

రాజపుత్రుల కానాడు త్యాగం అభిమానమంత్రం. దేశ ధర్మరక్షణలకు ప్రాణాలర్పించడం మహా మహావ్రతం.

అలాంటి వీరజాతికి దివ్యకలశం రాణాప్రతాప్. ప్రతాపసింహుని చరిత్ర ఒక వీర రస మహా కావ్యం. ఆయన జాతి స్వాభిమానానికి స్వాతంత్ర్యేచ్ఛకు, పరమ వీర వ్రతానికి దివ్య పతాకగా జీవించిన ఆదర్శఖని. ఆయన రగిలించిన దివ్య జ్వాలలు, గురుగోవిందుడిగా, విద్యారణ్యులుగా, శివాజీ ఛత్రపతిగా, ఝాన్సీలక్ష్మీబాయిగా ఆ తరువాతి యుగంలో వెలుగులు క్రుమ్మరించాయి.

అక్బరు మేవాడ్ మీదికి మొదటి దండయాత్ర చేసినప్పుడు, ప్రతాపసింహుని తండ్రి ఉదయసింహుడు మొగలు సేనల ధాటికాగలేక, ఆరావళీ పర్వతాలలో తల దాచుకొన్నాడు. నాటి సేనాపతులు జయమల్, పత్తాలు చివరి క్షణం వరకు పోరాటం సాగించి వీరస్వర్గాన్ని అలంకరించారు. ఉత్తర భారత స్వాతంత్ర దీపికగా మిగిలిన మేవాడ్ శత్రు దురాక్రమణకు బలి అయిన తరుణంతో ఉదయసింహుని మరణానంతరం ప్రతాపుడు రాజైనాడు.

రాజ్యం లేదు. ధనసంపదలులేవు. నమ్మిన కొంతమంది వీరయోధులు తప్ప సైన్యంలేదు. నిలవ నీడకూడా లేని దుర్భర పరిస్థితి. తోటి రాజపుత్రులు విదేశ విధర్మ పరిపాలకుని ముందు తలదించి, అతని పల్లకీకి బోయీలైనారు ప్రతాపసింహుడీ పరిస్థితినుంచి మేవాడ్ రక్షణకు ప్రతినపూనాడు మేవాడ రాజ్యం స్వతంత్రం కానిదే ఆరుబయట జీవిస్తా, కటికనేల శయినిస్తా, వెండి, బంగారు పాత్రలను, నగలను ముట్టను అని భీష్మ ప్రతిజ్ఞ చేశాడు. భార్యాపిల్లలతో ఆరావళీ గహనాటవులలో రోజుకొక చోట తరుముతున్న మొగలు సేనలను, గెరిల్లా పోరాట వ్యూహంతో ఎదిరిస్తూ, అక్బరు గుండెలో బల్లెమై జీవించాడు.

అక్బరు మహారాణా ప్రతాపునికి ఎన్నో సందేశాలు పంపాడు. ఆశలు చూపాడు. "నా దర్బారుకు రానక్కర

లేదు. నాకు సామంతుడివి కానక్కరలేదు. ' అక్బరు భారత సామ్రాట్టు ' అని అంగీకరిస్తే చాలు. నీ రాజ్యాన్ని నీవు స్వేచ్ఛగా పరిపాలించుకోవచ్చు " అని మానసింహునితో సందేశం పంపాడు. ప్రతాపుడు ఆ సందేశాన్ని తిరస్కరించడమే కాక, మానసింహునికి కూడా జైత్రోచితమైన పాఠం గరిపాడు.

అక్బరు ప్రతాపసింహుల తొలి యుద్ధం హల్దీఘాట్‌లో జరిగింది. అదొకఅద్భుతగాధ. ఆయుద్ధంలో జయం ఎవరికీ లభించలేదు. ప్రతాపుడు చివరి ఘడియల్లో శత్రుసైన్యపు వ్యూహాన్ని ఛేదించుకొని బయట పడ్డాడు.

వత్తిడి ఎక్కువైంది. దిన వెచ్చంకూడా లభించని దుర్దశ. తమకు తిండిలేదు. అడవి ధాన్యంతో రొట్టెలుచేసి పిల్లల చేతికిస్తే, అడవి పిల్లి వాటిని అపహరించుకుని పోయింది. ప్రతాపుడు క్షణం చలించినట్లు కన్పించింది. ప్రతాప సింహుడు చలించడం అతనికే కాదు, తోటి రాజపుత్రులకు కూడా దుర్భరమైంది. అక్బరు దర్బారులో ఓ కవి పృథ్వీరాజ్ ప్రతాపసింహునికి ఒక లేఖ వ్రాసాడు.

" ఓ సింహమా ! ప్రతాపా ! దేశంలో నీ వొక్కడివే స్వాతంత్ర్యానికి ప్రతీకగా మిగిలావు ధర్మానికీ ధరిత్రికీ సంరక్షకులుగా సన్మానితులైన మిగతా రాజపుత్రులందరూ అక్బరు అవినీతికి దాసోహమన్నారు కాని నిన్నే తనకు రక్షకుడని భావించిన మన ధర్మాన్ని ఎలా త్యజిస్తావు ? శరణాగతుని రక్షించడం క్షత్రియధర్మం " అని ఉద్బోధించాడు

" అంతిమ యహ ఉపాయ, బీసంభర న బిసారియో,
సాధేధర్మ సహాయ, పల పల రాణా ప్రతాప్ సే "

1576 లో జరిగిన హల్దీఘాట్ యుద్ధం తరువాత కాలం నిరంతర సంఘర్షతో గడిచింది. ఆ వీరమూర్తి ఆదర్శం దావానలంలా వ్యాపించి అనేక వీర యోధులను సృష్టించింది. భామాసా అనే వణిక్ప్రభువు, ప్రతాపుని మంత్రి తన సర్వ సంపదను ప్రతాపుని పాదాల దాపున క్రుమ్మరించి, పునస్సంఘటనకు తోడు నిలిచాడు. అలా



## ఖండములు ... వైశాల్యము

| | | చ. కిమీ. |
|---|---|---|
| 1. | ఆఫ్రికా ఖండము | 3,02,33,000 |
| 2. | అంటార్కిటికా ఖండము | 1,32,09,000 |
| 3. | ఆసియా ఖండము | 4,44,26,000 |
| 4. | ఆస్ట్రేలియా ఖండము | 76,95,000 |
| 5. | యూరప్ ఖండము | 1,05,23,000 |
| 6. | ఉత్తర అమెరికా | 2,49,55,000 |
| 7. | దక్షిణ అమెరికా | 1,77,93,000 |

భారతదేశ వైశాల్యము 32,80,483 చ.కిమీ.

ప్రతాపసింహుడు పలు దశాబ్దాలు పోరాడి, క్రమంగా అక్బరు వశపరచుకున్న భూభాగాలను తిరిగి జయించి, మేవాడు రాజ్యాన్ని ముక్తం చేసుకున్నాడు. అతని జీవన కాలంలో అక్బరు తిరిగి మేవాడ్ వైపు దృష్టి మరల్చలేకపోయినాడు.

ప్రతాపసింహుని రాజ్యం చిన్నదే. కాని అతను నిలిపిపోయిన ఆదర్శం ఏ జాతికైనా, ఏదేశానికైనా నిరంతరం ఉపాసించ తగ్గది. బాధలకు బలికాకుండా, స్వార్థానికి తలదించకుండా, కోరికలముందు నతమస్తకులు కాకుండా దేశ స్వాతంత్ర్య పిపాసను, ధర్మదీప్తిని, సంధిషరతుల నెరుగని నిష్కలంక దేశభక్తిని, వీరవృత్తిని వారసత్వంగా మనకు బహూకరించి రాణాప్రతాప్ 1597 లో కన్నుమూసాడు.

ప్రతాపసింహుడు రఘు, శ్రీరామచంద్ర, కృష్ణార్జున, చంద్రగుప్త, శాలివాహన మహాజోతిర్మూల పరంపరలో వెలుగొందిన దివ్య రత్నం. అతని స్మరణ జాతికి అమృతోపస్మరణ.





# ఆడంబరం ఆనందానికి అతి దూరము

## శ్రీ సత్యసాయి బాబా

ఆరోగ్యమునకు దేహ శుద్ధి ఎంత అవసరమో, ఆనందమునకు హృదయ శుద్ధి అంత అవసరం. చిత్త శుద్ధి నిమిత్తమై మానవుడు చేయు సమస్త కర్మలయందును దైవత్వాన్ని విశ్వసించి పవిత్రమైన దివ్యత్వాన్ని అభివృద్ధిపరచుకోవాలి. మానవుడు ఆడంబరములతో, అహంకారములతో, భౌతికమైన భ్రాంతులతో తనయొక్క జీవితమును తగ్గించివేసుకుంటున్నాడు. ఆడంబర అహంకారములు వున్నంతవరకూ ఆనందమునకు అతి దూరమవుతున్నాడు మానవుడు. మనసు ఆనందమును అనుభవించునుగాని, ఆడంబరము మాత్రం ఆనందానికి అతిదూరము. సముద్రము తనయందు విలువైన ముత్యములను వుంచుకొని, విలువ లేనటువంటి చెత్తగుల్లలను మాత్రం బయటకు కొట్టివేస్తుంది.

## 'నేను – నేను'

ఈనాటి మానవుడు గుండెబలమును, కండబలమును ఆధారం చేసుకొని బ్రతుకుతున్నాడేగాని; ధర్మబలం, దైవబలమును ఆధారంగా ఆశించడంలేదు తాను ఏదై వున్నాడో, ఆ స్వరూపాన్ని మాత్రం మరచిపోతున్నాడు తాను కానటువంటి స్వరూపాన్ని తనదిగా భావించుకొని కృంగిపోతున్నాడు. ఆత్మను మరచిపోతున్నాడు ఉన్నది సత్యం ఒక్కటే. అది "నేను". ఈ "నేను - నేను" అనేటటువంటిది ఎల్లప్పుడునూ ఉన్నది. గాఢనిద్రలో మానవుడు అనేకవిధములైనటువంటి తలంపులను మరచినప్పటికిన్నీ, తాను లేకుండా వుండలేదు. గాఢనిద్రయందు తన దేహముగాని, తన భావములు గాని, తన గుణములుగాని, తన నామముగాని ఏమాత్రం గూడనూ వుండవు. కానీ తాను లేనని మాత్రం చెప్పుటకు వీలు కాదు. నేను అనేటటువంటిది గాఢనిద్రయందు కూడా ఉన్నది. ఆ నేను అనేటటువంటి తత్వాన్ని గుర్తించడమే సాధకునియొక్క లక్ష్యం. నేను గోపాలుడు. మా తండ్రి పేరు 'భూపాలుడు'. నా కుమారుని పేరు 'నేపాలుడు'. ఈ విధముగా తాను తన తండ్రి, తన కుమారుని తత్వాన్ని, రూపాన్ని, నామాన్ని అభివృద్ధి గావించుకొని పోతున్నాడేగాని మానవుడు, తన తత్వమేమిటో తాను గుర్తించడానికి ప్రయత్నించడం లేదు. ఈ రెండు నామము లెవరివి ? ఇవి మానవ కల్పితం. మానవ దేహము వుండినంతవరకు ఈ జగత్తు ఉంటుంది.

ఆత్మ అనగా హృదయమే. హృదయము స్వయం ప్రకాశమైనటువంటిది. హృదయమునుండి వెలుగు మెదడుకు ప్రసరిస్తూ వుంటుంది. ఆ సారమే మనోసారము. హృదయము యొక్క వెలుగు మనస్సుపైన ప్రసరించడం చేతనే, ఈ మనస్సు జగత్తును చేరగలుగుతున్నది. ఈ మనస్సుపై హృదయము యొక్క వెలుగు లేకుండిన, ఈ మనస్సు జగత్తును ఏమాత్రం చూడలేదు. అనుభవించలేదు. మనసే లేకుండిన ఈ జగత్తే లేదు. "మనోమూలం ఇదం జగత్" మనసే చంద్రుడు. పగటివేళ ఈ చంద్రుడు ఏ విధముగా అదృశ్యమై వుండునో, అదే విధముగా ఈ ఆత్మలక్ష్యమందు ఈ

మనసు అదృశ్యమై వుండాలి. చంద్రుడు స్వయం ప్రకాశకుడు కాదు. సూర్యుని కిరణములు చంద్రునిపైన ప్రసరించడం చేతనే చంద్రుడు ప్రకాశిస్తున్నాడు. అదే విధముగ ఆత్మనుండి వెలుగు ప్రసరించడం చేతనే మనసు ప్రకాశిస్తున్నది. చంద్రుడు ఏవిధముగ స్వయం ప్రకాశకుడు కాదో, మనసుకూడా అంతే. కనుక సర్వులకూ ఆత్మయే ఆధారము, ఆత్మయే మూలము, ఆత్మయే సర్వమూ. మానవుడు తన దేహమందు ఆత్మ వున్నదని భ్రమిస్తున్నాడు దేహము, మనసూ, విశ్వమూ సర్వమూ ఆత్మయందున్నదేగాని, ఆత్మ మరొకదాని యందు లేదు. సర్వమూ ఆత్మమయమే, ఆత్మస్వరూపమే. సమస్త చర్యలూ ఆత్మచర్యలే. జపములూ, ధ్యానములు, యజ్ఞములూ, యాగములూ - ఇత్యాది సాధనములన్నియూ ద్వైతబుద్ధిగలవాని తత్వములే తప్ప నిజమైనటువంటివి గావు.

## దైవము

దైవము తనకంటె భిన్నంగా వున్నాడనేటటువంటి వాడు మూర్ఖుడు. దైవము తనకంటె భిన్నంగా లేడు. దైవమునకు ఒక హృదయమున్నది. ఆ హృదయమే దైవము దైవమే ఆత్మ ప్రత్యేకంగా వున్నదని భావించేవారు దైవమునకు హృదయము లేదని భావించినటువంటివారే ఎన్ని గ్రంథములు చదివినప్పటికిన్నీ, ఎన్ని సాధనలు చేసినప్పటికిన్నీ, ఎంతమంది మహనీయులను దర్శించినప్పటికిన్నీ, తన తత్వాన్ని తాను గుర్తించుకొననివాడు పూర్తి మూర్ఖుడే. ఆత్మ లక్ష్యము లేనటువంటి సమయమునందే మనకు జగత్ లక్ష్యము కనిపించుచున్నది. కనుక మన లక్ష్యమును ఆత్మగా వుంచుకున్నప్పుడే ఈ జగత్ అదృశ్యంగా వుంటుంది మానవుడు చేయు సమస్త సాధనములను మనస్సులో చేయుచున్నాడు. అదే పెద్ద పొరపాటు. మనస్సుతో చేసేటటువంటి సాధనలన్నీ మనస్సువైపే మళ్ళుతాయి గాని ఆత్మ వైపునకు మళ్ళించుటకు వీలుకాదు. "యదో వాచానివర్తన్తే అప్రాప్య మనసాధః" మనస్సునకుగాని,

## మీకు తెలుసా?

* బ్రిటిష్ రాజు 3వ హెన్రీ పాలనాకాలం, (1216-72) లో "పార్లమెంటు" అన్న పదం వాడుకలోకి వచ్చింది.
* పశ్చిమ జర్మనీలో గాటింగ్ హోమ్‌కు చెందిన 33 మంది శాస్త్ర వేత్తలు నోబెల్ బహుమతి గెల్చుకున్నారు.
* ప్రపంచంలో తొలి పోస్టేజ్ స్టాంపు విడుదల చేసిన ఘనత బ్రిటన్‌దే. 'బ్లాక్ పెన్నీ' గా ప్రసిద్ధికెక్కిన ఈ స్టాంపును 1840 మే 6వ తేదీన బ్రిటన్ విడుదల చేసింది.
* గ్యాలియం అనే అరుదైన లోహం 86 ఫారెన్ హీట్ డిగ్రీల వేడికి కరుగుతుంది. దాన్ని తాకి చూస్తే ఫర్వాలేదు. కాని అరచేతిలో పెడితే అది కరిగిపోతుంది.
* మాస్కో నగరం కింద ఉన్న భూగర్భ రైలు ప్రయాణాలలో 1935 నాటి చార్జీలే ఇప్పటికీ అమలులో ఉన్నాయి.
* షేక్స్‌పియర్ మొత్తం రచనలన్నీ కలసి ఇరవై వేల పదాలకి మించవు. మిల్టన్ వ్రాసినవైతే రెండువేల పదాలే.
* ఆంగ్లభాషలో "సెట్" అనే పదానికి 58 నామ వాచకపదాలు, 126 క్రియాపదాలు, 10 క్రియా విశ్లేషణ పదాలు వున్నాయి.
* కలకత్తాలోని "హుగ్లీ" నదిపై గల వంతెన మీదుగా రోజుకు 57 వేల వాహనాలు ప్రయాణిస్తాయి.

ప్రపంచంలో జపాన్ మోటారు వాహనాలను అత్యధిక సంఖ్యలో తయారు చేస్తుంది. ఆ దేశం 1980 లో ఒకకోటి 10 లక్షల 43 వేల మోటారు వాహనాలని తయారు చేసింది.

* ప్రపంచం మొత్తంమీద రోజుకు 2,13,700 మంది చొప్పున జనాభా పెరుగుతోంది

వాక్కునకుగాని ఏవిధమైనటువంటి విధముగను ఈ ఆత్మ తత్వాన్ని గుర్తించుటకు వీలుకాదు. దొంగ ఏనాటికైనను మరొక దొంగను తాను పట్టించడానికి ప్రయత్నించినా దొంగ తానేనని, తనకుతానే పట్టుబడటానికి ఎవ్వడూ ప్రయత్నించడు. అదే విధముగనే మనస్సు ఒక దొంగ. తనను తాను వశము చేసుకొనుటకు ఏమాత్రం అది ప్రయత్నించదు. అయితే మనస్సును అరికట్టడం ఎలా ? మనస్సును ఆత్మవైపుకు మరల్చినప్పుడు మనస్సును అప్రయత్నంగా కూడా అరికట్టుకోవడానికి వీలవుతుంది. అప్పుడు ఈ జగత్ భాగములు అదృశ్యమైపోతాయి.

## అహం + ఆకారం

'అహం' అనగా ' నేనే '. అహమేగాని ఆత్మకాదు. ఈ అహం కూడను ఆకారముతో కూడి వుండినంత వరకునూ ఇది అహంకారంగా మారిపోతుంది. ఆకారమును త్యజించినప్పుడే తాను తానుగా వుండగలడుగాని, ఆకారమును చేర్చుకున్నంతవరకు తనకు తానుగా వుండ లేడు. కనుక నిజమైనటువంటి ఆత్మస్వరూపమైనటువంటి " నేను " ఆ కా ర ము తో కూడి వుండటమే అహం + ఆకారం = అహంకారం అయిపోయింది. దురహంకారం మాత్రం వుండరాదు దారితప్పి నడిచే టటువంటి వ్యక్తి ఎన్ని ప్రమాదములకు గురిఅవుతాడో, నీతి తప్పి నడిచిన వ్యక్తి అన్ని అవమానములకు గురి అవుతాడు. ఈ వాస్తవాన్ని విస్మరించి, అశాశ్వతమైనటువంటి భౌతికమైన రూప నామములకే మనం విలువ యిస్తున్నాం. తన కోసం, తన కుటుంబం కోసమే జీవిస్తున్నామని భావిస్తుంటారు. చాలామంది ఈ రెండింటి సంబంధంలోనే జీవితాన్ని గడుపుతున్నారు. కాదు! కాదు! మూడవది మనస్సు వున్నది. అదే సమాజము, అదే ప్రపంచం. " నా దేశం బాగున్నప్పుడే నేను బాగుంటాను. నా సమాజం అష్టకష్టములకు గురైనప్పుడు నేనూ కష్టాల పాలవుతాను. నా భవిష్యత్తు సమాజం భవిష్యత్తుపై ఆధారపడి వుంటుంది. నేను సమాజం కోసమే బ్రతుకుతున్నాను. నా కుటుంబక్షేమం సమాజ క్షేమంపై ఆధారపడి వుంటుంది" అని ప్రతి వ్యక్తి భావించాలి. అప్పుడే సమాజంలో సుఖశాంతులు నెలకొంటాయి.

## సమిష్టి స్వరూపము :

తాను ఎప్పుడు బాగుంటాడు? తన కుటుంబం బాగున్నప్పుడు తనకుటుంబం ఎప్పుడు బాగుంటుంది? తన సమాజం బాగున్నప్పుడే.సమాజం బాగుంటే కుటుంబం బాగుంటుంది. కనుక సమిష్టి స్వరూపమైన సమాజం చైతన్యంగా వున్నప్పుడే మన మనస్సు క్షేమంగా, ప్రశాంతంగా వుంటుంది. కనుకనే భగవంతుడు త్రిమూర్త్యాత్మక స్వరూపుడు అన్నారు. వ్యక్తి స్వరూపం ఒకటి. కుటుంబ స్వరూపమనేది రెండవది. సమాజ స్వరూపం మూడవది. ఈ మూడు త్రిమూర్తి స్వరూపాలు. ఈ త్రిమూర్తులయందును ఒకే ఆత్మస్వరూపం, అదే దైవత్వం. "దైవ" అనే పదమునకు సమిష్టి స్వరూపము అని పేరు. ఒకే శరీరంలోని అవయవాలు భిన్నంగా వేరుగా వుంటాయి. ఒక అవయవానికీ మరొక అవయవానికీ ఏమాత్రం పోలిక వుండదు. అయితే ఈ సర్వాంగములకునూ సమానమైన తత్వముగా వుండేది గుండె ఒకటే. ఒక్కొక్క అవయవమునకు ఒక్కొక్క గుండె లేదు. మొత్తం శరీరానికి ఒకే గుండె వుంటుంది. అదే విధముగా ఒక్కొక్క దేశము, ఒక్కొక్క పట్టణం, ఒక్కొక్క గ్రామం, విభిన్న ఆకారాలు గల మనుషులు- భాషలు చూడటానికి వేరుగా కనిపించవచ్చు. అయితే సమిష్టి స్వరూపమైన దైవం మాత్రం ఒక్కడే అతనే హృదయం. "దేవో దేవాలయప్రోక్తో, జీవో దేవో స్సనాతనః " ఈ దేహమనేటటువంటి దేశము భగవంతునికి ఒక దేవాలయం. ఈ ప్రపంచం భగవంతుని విశాలమైనటువంటి వ్యక్తిస్వరూపం కనుక మనం భగవంతుని చూడాలనుకున్నప్పుడు ఈ విశ్వస్వరూపాన్ని భగవంతునిగా భావించి దర్శించినప్పుడే అదే నిజమైన భగవద్దర్శనం. మనస్సు శాస్త్రము, మనస్సు ధర్మము, మనస్సు వేదము, మనస్సు ఇతిహాస పురాణములు - ఇవన్నియు కూడను ద్వైతభావములే. ఈ ద్వైతభావములు వుండిన ప్రతి

# "శ్రీవాణి" జీవిత సభ్యులు



శ్రీ ఆవుల వెంకయ్య
కోదాడ, నల్లగొండ జిల్లా



శ్రీ పమిడిమర్రి నాగభూషణం
కోదాడ, నల్లగొండ జిల్లా



శ్రీ చంద్రభట్ల వెంకట్రామయ్య
శ్రీ కృష్ణా ఫైనాన్స్ కంపెనీ,
నందిగామ, కృష్ణాజిల్లా

మానవునికి కొంతకాలం దేహాన్ని అనుసరించక తప్పదు. తనయొక్క దృష్టి సృష్టిపై వుండినంతవరకున్నూ ఇట్టి భావములే ఆవిర్భవించుతుంటాయి. ఈ జగత్ భావముల యందే తాదాత్మ్యమై వుంటాడు. కనుక ఈ జగత్ భావములుండినంతవరకు సర్వశాస్త్రములూ అత్యవసరములే.

## పంచాంగము

కాలస్వరూపమే ఈ జగత్ వేదము అంతా కాలమునే ప్రధానంగా తీసుకుంది. ఈ కాలము పంచేంద్రియములతో కూడి వుంటుంది. ఈ పంచేంద్రియముల ప్రభావమే పంచాంగములు. పంచాంగం జరుగబోయే విషయాలను సూచిస్తుందిగాని పరిష్కారం మాత్రం సూచించదు. పంచాగతత్వం ప్రాకృతమైన స్వరూపాన్ని కొంతవరకు చిత్రిస్తుంది. ఈ ప్రపంచమంతా నవగ్రహములతో కూడి వుంటుందని దీని భావం. ఈ నవగ్రహములతో రాజు, మంత్రి, చంద్రుడు, కుజుడు ఈ సంవత్సరం బలమైనవారుగా వున్నారు. శనికి ఈ సంవత్సరం ఏమాత్రం స్థానంలేదు. తిండికి ఏమాత్రం లోటు వుండదు 80 శాతం పంటలు పండుతాయి. కాని ప్రాకృతమైన మార్పు ఎంత మంచిగా జరిగినప్పటికీ మానవుని మనస్సు మాత్రం పరివర్తన చెందకపోతే ప్రయోజనం ఏమాత్రం ఉండదు. కనుక ఈనాడు మానవునియొక్క పరివర్తన అత్యవసరం. మనస్సును పవిత్రమైన మార్గంలో, ఆత్మతత్వము నుండి విశాలమైన రీతిగా మారుతున్నప్పుడే ఈ జగత్ నిరంతరం సుభిక్షంగా వుంటుంది.

## తపస్సు

చాలామంది తపస్సు చేస్తున్నామంటారు తపస్సు అంటే ఏమిటి ? తల కిందపెట్టి కాళ్ళు పైకి పెట్టి వుండటమా ? కాదు. మన హృదయాన్ని కరిగించి ప్రవహించేటట్లుగా చేయటమే నిజమైన తపస్సు లక్ష్యం. దిక్కులేనివారిని చూచినప్పుడు మన హృదయం కరిగి

ప్రవహించాలి. హృదయమును కఠినమైన శిలగా వుంచుకొని ఎన్ని సాధనములు చేసినప్పటికీ ప్రయోజనం వుండదు. ఇది కేవలం కాలాన్ని వృధా పరచడమే.

## ధ్యానం

ధ్యానమనగా ఒకే విషయం మీద మనస్సును మరల్చి, కేంద్రీకరించి వుంచడమే. ఈ మనస్సునే దైవముమీద మరల్చినప్పుడు అది దైవ ధ్యానమవుతుంది. ఈ ధ్యానమునకు అనేకమంది అనేక రూప నామములు కలిపించి, నిజమైనటువంటి ధ్యానమును మరచిపోతున్నారు ధ్యానమునకు ఒక రూపం లేదు. చంచలమైన మనస్సుతో ధ్యానం చేయడం సాధ్యంకాదు. ధ్యానం, ధ్యానం అనే పేరుతో ఈ చంచలమయిన మనస్సును పట్టుకొని గంట రెండు గంటలూ కాలాన్ని వృధా పరుస్తూ, అనేక అశాంతులకు గురి అవుతున్నారు. ధ్యానమనేటటువంటిది కేవలం ఒక విషయానికి మాత్రమే పరిమితమయినదికాదు. నిత్య జీవితంలో నీవు చేసే పనులను శ్రద్ధగా, ఏకాగ్రతతో చేయటం నేర్చుకోవాలి సమాజసేవకు అంకితం కావాలి. నీకు నిర్దేశించబడిన కర్మలను సక్రమంగా నిర్వర్తిస్తూ, దైవాన్ని చింతిస్తూ వుండాలి. ఒక క్షణమయినా వృధా పరచరాదు. తోటివారికి తోడ్పడుతూ వుండాలి సమస్త జీవరాసుల యడల దయ, ప్రేమ, కరుణలను చూపించాలి. సమస్త కర్మలను నిష్కామ బుద్ధితో ఆచరించడమే నిజమైన ధ్యానము. నీ కర్తవ్యమును సక్రమంగా ఆచరించడమే ధ్యానము.

## ఏకాంతవాసము :

ఏకాంతవాసం అంటే ఏమిటి? కొంతమంది ఏకాంత వాసమునకు వెళ్ళి తపస్సు చేసుకుంటామంటారు. మనుష్య సంచారం లేని ఏ హిమాలయాలకో వెళ్ళి ముక్కు మూసుకొని ధ్యానం చేసుకోవాలని భావిస్తూంటారు. కాకులు దూరని కారడవులకెళ్ళి వంటరిగా ధ్యానం చేసుకోవాలనుకుంటుంటారు. ఏకాంత తత్వాన్ని అర్థం చేసుకోనటువంటివారే ఈ విధంగా భావిస్తుంటారు. ఏకాంతమనగా మనస్సును స్తంభింప చేసుకోవటమే. ఇది అరణ్యాలకు పోయినంతమాత్రాన లభ్యం కాదు. సంకల్పాలను ఆరికట్టకుండా ఏ స్థానంలో కూర్చున్నప్పటికీ అది ఏకాంతం కాదు. నీవు అరణ్యాలలో కూర్చున్నప్పటికీ నీ మనస్సు ప్రపంచంలో సంచారం చేస్తుంటే అది ఏకాంతం ఎట్లా అవుతుంది? సంకల్పములను నిరోధించడమే సమాజం. సంకల్పములను లేకుండా చేసుకోవడమే మంచిది. లేక సంకల్పములుండి కూడను తన సంకల్పములు దైవసంకల్పములుగా భావించాలి.

## సంకల్పములు

ఈ సంకల్పములు అసలు ఎలా వస్తున్నాయి? ఏవిధంగా వస్తున్నాయి? "నేను, నేను" అనే సంకల్పము వచ్చిన తరువాత, ఈసంకల్పములన్నియు ప్రవేశిస్తున్నాయి కొంతమందికి ఈ జగత్తు లోపల నేను ధ్యానమునందు గాని, యోగమునందుగాని, లౌక్యమందుగాని సౌఖ్యమును అనుభవిస్తున్నామని ఆనందిస్తుంటారు. నిజమైన ఆనందం ఏమిటో! నిజమైన సౌఖ్యమేమిటో! గుర్తించని వారే ఈ విధంగా భావిస్తుంటారు చక్కగా విచారిస్తే సౌఖ్యమును నీవు అనుభవిస్తున్నావా? లేక నిన్నే సౌఖ్యములు అనుభవిస్తున్నాయా? కాదు! కాదు! ఈ సౌఖ్యములే నిన్ను అనుభవిస్తున్నాయి. మానవుడు సర్వసౌఖ్యములూ అనుభవించి, దానివల్ల ఈ శరీరమునందున్నటువంటి సమస్త శక్తిని గుంజుకొని, ఈశరీరంతో రాగ,ద్వేష, అసూయాది రోగములను కల్పించుచున్నాయి. దేహంతో అనుభవించే సౌఖ్యములు నిజంగా సౌఖ్యములు కావు. నిజంగా ఈ సౌఖ్యములే అనుభవిస్తుంటే దేహం ఎందుకు బలహీనం కావాలి? దేహం ఎందుకు వార్థక్యమును చూడాలి? దేహం ఎందుకు శిథిలంకావాలి? సౌఖ్యములు ఈ దేహాన్ని అనుభవిస్తున్నాయి కాబట్టే, దీనిని పీల్చి పిప్పిని చేసి వార్ధక్యములో ముంచి వేస్తున్నాయి. కనుక నీవు నీది కానటువంటి సౌఖ్యాలను నీదిగా భావించుకొని మురిసిపోతున్నావు, నీ తత్వాన్ని నీవు మరచి పోతున్నావు. కనుక మొట్టమొదట ప్రతి మానవుడు కూడను "నేనెవరు? నేనెవరు!" "నేను"

అనే తత్వాన్ని గుర్తించాలి. "నేనే" సర్వత్రా వున్నాను. "నేనే" సర్వరూపాన్ని "నేనే" ఆత్మను ఆత్మ అనే హృదయమును. హృదయము "ఆత్మ" ప్రత్యేకంకాదు ఈ "నేను" అనే తత్వాన్ని గుర్తించడానికి ప్రయత్నించడమే మన యొక్క సాధన. కనుక ప్రతిమానవుడు కూడను ఏదో తెలియని మార్గములలో ప్రవేశించి, తద్వారా అనేక విధములైన తికమకలకు లోనై, నిజమయిన ఆధ్యాత్మిక మార్గమును కొంతవరకు విస్మరిస్తున్నాడు.

## ద్వైతభావములు

మనం ఈనాడు చేసే సాధనలు కూడను ద్వైత భావంతోనే చేస్తున్నాం ఎంతకాలం ఈ ద్వైతంలో వయనిస్తే అంతకాలం మన జీవితం వ్యర్థమే. మనం దీనిని మార్చుకోవాలి. 'మనయొక్క శక్తి తత్వం మొత్తమును మన కల్పనే అనే సత్యమును అర్థం చేసుకోవాలి. మనం సృష్టించినప్పుడే సృష్టివస్తుండాలి. కనుక " విశ్వం విశ్వ స్వరూపం " అనే సత్యాన్ని మనం గుర్తించాలి మనం అనేక రకములుగా సాధనలు సలుపుతున్నాం. జపములు చేస్తున్నాం. పూజలు చేస్తున్నాం-యజ్ఞములు, యాగములూ చేస్తున్నాం. " వీటన్నింటికీ నేను లభించే టటువంటి వాడను కాను " అని భగవద్గీత మనకు బోధిస్తున్నది " యజ్ఞాలకు నేను చిక్కను, యాగాలకు నేను వశము కాను, ధ్యానములకు నేను ఏ మాత్రం లభించను " అని గీతలో భగవానుడు చెప్పాడు అయితే ఇవన్నీ నిరసించమని కాదు. ద్వైతభావములో వున్న మానవునికి ఇవి అవసరం. " అనిత్యం అసుఖం లోకం " అని గీత బోధించింది. ఇలాంటి అనిత్యం, అసుఖం అయినటువంటి లోకంలో నిత్య సత్యమైనటువంటి సుఖశాంతులను ఏ విధంగా సాధించగలం ? శాశ్వతమైన, సత్యమైన ఒక తత్వమున్నది అదే " ఆత్మతత్వము " సముద్రం ఏ విధంగా విలువైన ముత్యములను తనయందు వుంచుకొని, విలువ లేనటువంటి నత్తగుల్లలను బయటకు త్రోసి వేస్తుందో, అదే విధముగా విలువైనటువంటి ఆత్మ తత్వాన్ని మనం భద్రపరచుకొని, విలువలేనటువంటి భారములను, రూపములను, నామములను మనం విసర్జించాలి. ఎంతకాలము ఈ దేహ భ్రాంతిని పోగొట్టుకొనలేక జీవిస్తూ పోతుంటామో అంతకాలం రూపాతీతమైనటువంటి, భావాతీతమైనటువంటి నిజతత్వాన్ని మనం అనుభవించలేం ? అటులని ఈ సరస్వాన్నీ త్యజించమని కాదు నీ కర్తవ్యాన్ని నిర్వర్తించుకుంటూ కూడను ఆత్మ తత్వాన్ని లక్ష్యమునందుంచుకోవాలి చేసేది ఆత్మ. చేయించేది ఆత్మ. అనుభవించేది ఆత్మ. సర్వమునూ ఆత్మమయమే అనేటటువంటి విశాలభావాన్ని మనం అభివృద్ధి పరచుకోవాలి. ఈ ఉన్నత లక్ష్యంతో మనం ముందుకు సాగాలి. ఇదే మన కర్తవ్యం.

( ది 30-3-1987 న ప్రశాంతి నిలయంలో ఉగాది ఉత్సవంలో భగవాన్ శ్రీ సత్యసాయిబాబాగారు చేసిన ప్రసంగంనుండి )



## ఆణిముత్యాలు

"అహంకారము హృదయమును ఆవరించినపుడు భగవానుడు అందు ప్రకాశింపజాలడు."

——శ్రీ రామకృష్ణ పరమహంస

"సత్కార్యాలను చేసి చూపెట్టు చేస్తానంటూ ప్రచారం చేసుకుంటూ మురిసిపోకు."

——మహాత్మా గాంధీజీ

"కలసివుంటే నిలబడుతాం. చీలిపోతే కూలిపోతాము."

——సురేంద్రనాథ బెనర్జీ

"నాలుక వశము చేసుకొనినవానికి లోకమే వశమగును."

——శ్రీ సత్యసాయిబాబా

"శీలమునుబట్టి ఒక వ్యక్తి శీలమును నిర్ణయించాలి గాని, అతని వేషధారణను బట్టి కాదు."

——స్వామి వివేకానంద

# వ్యాస భాగవతములోని రామాయణ కథ

వేదవ్యాసమహర్షి భాగవతమున నవమ స్కంధమున పరీక్షిత్తునకు విష్ణుకథా పారాయణము వలన కలుగు పుణ్యము కొఱకు వర్ణించినది. శుకప్రోక్తము. ఇది పంచలక్షణములు గల పురాణము

వాల్మీకి మహర్షి ప్రత్యేకముగా నారదుని వలన ఉపదేశమును పొంది శ్రీమద్రామాయణమును కావ్యముగా రచించెను. వ్యాస వాల్మీకుల కధనములలో గల ఈషద్భేదములను వివరించుటయే ఈ వ్యాసము యొక్క ప్రధానోద్దేశ్యము.

## వేదుల మీనాక్షీదేవి

మహర్షి వాల్మీకి రామాయణమునకు కావ్య గౌరవము కలిగించుటకై పురవర్ణ నాదికములైన అష్టాదశ వర్ణనములు చేసి తన కావ్యమును ఆది కావ్యముగా చేసినాడు.

వ్యాసమహర్షి తన భారత భాగవతములలో ఎంత గొప్పవారికైనా కష్టములు తప్పవని ఉదాహరణముగా ధర్మరాజునకు సీతారాములవంటి వారికీ వనవాస క్లేశములు తప్పలేదని సంక్షిప్తముగా రామాయణమును చెప్పినాడు.

కొందరు పండితులు భారతగాధ కన్నా ముందుగానే శ్రీ రామాయణ గాధ జరిగినదనీ, కానీ, రచన విషయములో వ్యాసమహర్షియే ముందని అభిప్రాయపడినారు.

కల్పాంత భేదముల వల్లనో, కల్పనా భేదము ననో గాని వ్యాస, వాల్మీకుల రామాయణ గాధలకు కొన్నిచోట్ల భేదములు కనబడుచున్నవి. వానిలో ఒకటి రెండు విషయములు.

వ్యాసభగవానుడు భాగవతములోన తెల్పిన రామాయణ గాధలో సీతారామలక్ష్మణులు వనవాసమున కేగుట : సీతాపహరణము : సుగ్రీవునితో మైత్రి : వాలివధ : సేతు బంధనము : రావణ సంహారము అతి క్లుప్తముగా చెప్పినాడు.

రావణ వధానంతరము విభీషణుని పట్టాభిషిక్తుని చేసి సీతాదేవిని చూచుటకు స్వయముగా అశోకవనికి వెళ్ళినట్లు వ్రాసినాడు.

"తతోదర్శ భగవానశోక వనికాశ్రమే
క్షామాం, స్వవిరహవ్యాధిం, శింశుపామూల మాశ్రితాం
రామః ప్రియతమాం భార్యాం దీనాం వీక్ష్యాన్వకంపత
ఆత్మ సందర్శ నాహ్లాద వికసన్ముఖ పంకజమ్
ఆరోప్యారు రుహేయానం భ్రాతృభ్యాం
హనుమద్యుతః"

నిరంతర రామనామ జపపరాయణను, కృశాంగిని, జటాధారిణియైయుండి, మ్లానవదనయై నేలపై కూర్చుని యున్న నేలపట్టిని అశోకవనమున శ్రీరామచంద్రుడు కనులారా స్వయముగా చూచినాడు. మిగుల కాతరుడైనాడు, ద్రవించిన దాతని హృదయము.

శ్రీరామచంద్రుని చూచిన జానకి వదనాబ్జమానందముతో వికసించినది. ఆమెను ప్రేమపురస్సరముగా పుష్పక విమానమున ఆరోహింపచేసి అయోధ్యకు గొనిపోయెను

కాని, వాల్మీకిమహర్షి రామాయణమున రావణవధానంతరము ఈ విజయవార్తను సీతాదేవికి తెల్పుమని హనుమంతుని పంపినాడు శ్రీరాముడు. ఆ తరువాత విభీషణునితో "జానకిని సగౌరవముగా, సాలంకృతగా శిబికలో కొనిరమ్మని తెలుపును. విభీషణుని చేత రాముని ఆహ్వానమును వినిన సీతాదేవి దిగ్గునలేచి, ఉన్నదున్నట్లుగా వెళ్ళుటకు సిద్ధమై" నా రాముని చూచుటకు అలంకారము లెందుకని యన్నది.

"ఇది రాముని ఆజ్ఞ" అన్న విభీషణుని మాటలతో అంగీకరింపక తప్పలేదు పతిఅనువ్రతగావున.

"తతః సీతాం శిరసాత్నాం. యువతేభిః అలంకృతాః
మహార్హాభరణోపేతాం. మహార్హాంబరధారిణీం
ఆరోప్య శిబికాం " .... ....

సీతాదేవిని పల్లకిలో తీసుకొని వచ్చిరి. అని వాల్మీకి మహర్షి వ్రాసినాడు.

ఈ భేదము సీతాదేవి ఉత్తమ శీలమును పోషించుటకు వాల్మీకిమహర్షి రచించియుండవచ్చును.

ఈ విధముగనే వ్యాసవాల్మీకి రామాయణములలో భిన్నముగా మరియొకటి కనబడుచున్నది.

* * * *

శ్రీరామచంద్రుడు పట్టాభిషిక్తుడైన కొంతకాలమునకు ఒకనాటి రాత్రి తన పాలనలో ప్రజల చిత్తవృత్తి తెలుసుకొనగోరి ప్రచ్ఛన్నమున తిరుగుచుండగా ఒక యింటినుండి

" నాహం బిభర్మితాం దుష్టామసతీం పరవేశ్మగామ్
స్త్రైణోహి బిభృయాత్సీతాం. రామోనాహంభజేపునః

" పరగృహమున వున్న దుష్టురాలవగు నిన్ను నేను భరించను భార్యావశుడైన రాముడు పరగృహయగు సీతాదేవిని స్వీకరించాడు" అని వినబడినది.

అజ్ఞుడు, దుష్టస్వభావుడు అయిన అతని మాటలకు శ్రీరాముడు లోకాపవాదభీతుడై గర్భవతియైన సీతాదేవిని అరణ్యమునకు పంపినాడు. ఆమెను పరిత్యజించినాడు. ఆమె మెల్లగా వాల్మీకిమహర్షి ఆశ్రమమునకు చేరుకున్నది.

" అంత ర్వత్న్యాగతేకాలే యమౌ సా సుషువేసుతౌ
కుశలవ ఇతి ఖ్యాతే తయోశ్చక్రే క్రియా మునిః
మునే నిక్షిప్య తనయౌ సీతా భర్త్రా వివాసితా
ధ్యాయన్తి రామ చరణౌ వివరం ప్రవేశహ "

సీతాదేవి కుశలవులను వాల్మీకి మహామునికి ఒప్పగించినది. తాను భర్తృ పరిత్యక్త .... తన కర్తవ్యమింకేమియు లేదు. శ్రీరామచంద్రుని పాదపద్మములను స్మరించుచు పాతాళమున ప్రవేశించినది.

ఈ విషయము విని శ్రీరాముడు దుఃఖాక్రాంత చేతస్కుడయ్యాడని గ్రహించుకొనెనట - ఇది వ్యాసముని ప్రోక్తము.

వాల్మీకి రామాయణమున భృత్యునిచే లోకాపవాదము విన్న రాఘవుడు నిండు గర్భిణియైన సీతాదేవిని లక్ష్మణునిచే వనమునకు పంపుట ; అతడు వాల్మీకి మహర్షి ఆశ్రమ ప్రాంతమున నామెను విడచుట; వాల్మీకి ఆశ్రమమందు కవలలు జన్మించినట్లు, వారికి కుశలవులని నామకరణము చేసినట్లు వ్రాసినాడు. ఉపనయన, విద్యాభ్యాసములగు సంస్కారములు వాల్మీకి యే నెరవేర్చెను. మహర్షికి వారెవరైనదీ తెలియును. అందుకు తగినట్లుగ వారిని తీర్చి దిద్దినాడు.

తాను వ్రాసిన రామాయణమును తంత్రీ తాళ రాగ సమాన్వితముగా ఆ బిడ్డలకు నేర్పి శ్రీరాముడొనర్చు నశ్వమేధయాగ సందర్భమున గానము చేయించినాడు. ఆ సందర్భమున రాముని పనుపున సీతాదేవిని ప్రవేశ పెట్టినాడు.

ఆమె సాధ్వి, నిత్యము రామనామ ధ్యానపరాయణి, యని చెప్పి, తాను చెప్పునది సత్యమని, సత్యము కానిచో తన తపఃఫలమంతయు వ్యర్థమయినట్లేనని భార్యా పుత్రులను స్వీకరించమనినాడు. అన్నీ వినిన రాముడు సీతాదేవి అభిప్రాయము నడిగినాడు. అప్పుడామె -

" యథా2హం రాఘవాదన్యం మనసా?పినచింతయే
తథామే మాధవీదేవీ వివరం ధాతు మర్హతి "

అని భూదేవిని ప్రార్థింపగా భర్మమణిమయమగు సింహాసనమున భూదేవి వచ్చి తన తనయను తోడ్కొని పోయినది.

అంతటి మహర్షి మాటలు, శపథములు గుర్తించని భర్తకి ఆమె మాటల యందు నమ్మకమెట్లుండును. గాక మరల అగ్నిపరీక్ష కోరునా ? ఆ సందేహమే కలిగి భూదేవిని చేరుకొన్నది సీతాదేవి అని తోచక మానదు.

ఈ కథా భేదములు పురాణ రచనకును కావ్య రచనకునూ గల వ్యత్యాసమును వెలువరచుచున్నవి.

వ్యాస వాల్మీకులిరువురును కవులు, క్రాంత దర్శనులు ....

ఇరువురి పాఠములు శిరోధార్యములే. 

# భావలహరి

చల్లా రాధాకృష్ణశర్మ

అందమైన యువతి ఆభరణ విహీన
యైన నేమి, ఆమె అందగత్తె !
అందగత్తె కాని యప్పు డా భరణాల
అందచందములును మందగించు.

ఆమె నోరు తెరవనప్పుడు కాకమ్మ,
తెరిచిన పిక మనుచు తెలిసి కొంటి ;
మరి వసంత మెప్పుడరుదెంచునో ! అంత
దాక లోకమునకు కాక మామె !

ఆమె నోరు విప్పునంత వరకు గుణ
వతియె కాదు, రూపవతియు కూడ,
నోరు విప్పినంత ఊరునాడు వడంకు,
బయట పడును సుదతి పారవశ్య.

కన్నె మేని సొగసు గాంచి మోహించిన
పడుచువాడు తుదకు పరితపించె ;
కన్నె మనసు నేను కన్గొన నైతిగా -
నింద తప్ప ఏమి పొందినాను ?

చదువు లేదు, అందచందమ్ములా సున్న,
కట్నమా హుళక్కి, కన్య నెట్లు
వలచితివని తల్లి పలుక - కొడుకు చెప్పె.
మంచి మనసు విలువ నెంచదరమె ?

చాయ తక్కువని విసర్జింప వచ్చునే
మంచి నడవడి గల మానవతిని !
మంచి నడత లేని మగువ ఊర్వశి యైన
నాక మగునే బ్రతుకు ? నరక మగును.

తీగవంటి కన్నె దేవతావస్త్రమ్ము
గట్టి వీధి నడువ, కారు నడుపు
కొనుచు వచ్చు భర్త గని కాంత యను; ' పొందు
తిన్నగాను మీకు పున్నె ముండు. '

నలుబదేండ్లు దాటి నలుగురు పిల్లల
కన్నతండ్రి కూడ కన్నె పడుచు
గాంచి అంగలార్చె ; కామ మోహితుడు హి
తాహితముల నెట్టు లరయ గలడు ?

' నేడు ప్రాత చీర, నిన్న క్రొత్తది సుమా
అనుచు నామె పెట్టె యందు దాచె ,
ఇది కనుంగొని తలనెత్త లేదు - మరొక
భామ వెంట తిరుగు నామె భర్త.

పట్టు చీర కాదు, కట్టుకో నైలాను,
పెట్టు కొనుము వింత వింత నగలు ;
సొమ్ము ఖర్చు తప్ప సొగసెట్లు వచ్చును ?
జన్మతోడ వచ్చు చక్కదనము.

పడుచు వాని చూపు బాధావహము కాదు,
అతడు చూచి చూడనటుల చూచు,
కాని ఆ ముదుసలి కన్నార్పకయె చూచు -
అనుచు సిగ్గు పడెను అతివ యొకతె.

పల్లెటూరి పిల్ల ! పట్టణ మెట్లున్న ?
దనుచు బావ యడుగ, ఆ మరదలు
పిల్ల తాను కొన్న తెల్లని ప్లాస్టికు
పువ్వు వంక జూచి నవ్వసాగె.

పెండ్లి వలదటంచు భీష్మించు కొన్న నీ
విపుడు మార్చుకొంటి వేమి మనసు ?
ఆమె బదులిడె : ' మలినాత్ములౌ మగవారి
చూపు తూపుల నిక సైపలేను. '

పెద్ద పిల్లవాడు ముద్దు పెట్టుకొనెను
చంటి పిల్లవాని ; చాల కాల
మునకు పిదప కలసికొనిన భర్త సతిని
చూచి నవ్వె చూచి చూడనట్లు.

బయట నవ్వు మొగము, పరులతో మాటా
తేనె లొలుకునట్లు ; కాని యేమి
చిత్రమో తెలియదు, చిందులు త్రొక్కును
భార్య యింట కంట బడిన యంత.

రాత్రి ప్రొద్దు పోయె, రమణి యేమో చేత
నున్న నవల క్రింద నుంచదాయె ;
కోడి యింతలోనె కూయునేమో యని
అడలుచునె అతండు నడుము వాల్చె.

# నిద్ర — యస్. యన్. దుర్గారావు

ప్రతి మనిషికీ నిద్ర చాలా అవసరము. ప్రతి రోజూ నిద్రించక పోయిన యెడల మన మెదడు పని చేయక మనం ఏ పనీ చేయజాలము. అనేక రోజులు నిద్ర లేనివారు మనోవ్యాకులతకు లోనవుతారు. కాబట్టి ప్రతి మనిషికీ నిద్ర అవసరము, అది దేవుడిచ్చిన వరం.

మనిషికి రోజుకు 5 లేక 6 గంటలు నిద్ర సరిపోతుంది. ఇలా నిద్రించిన వారు ఆరోగ్యంగా ఉంటారు. అయితే ఒక్కొక్కరి తత్త్వము ననుసరించి ఈ పరిమాణమున భేదములుండవచ్చు కానీ యింతకన్న ఎక్కువ కాలము నిద్రించుట నిషిద్ధము, అనారోగ్యకరము

ఏ రాత్రియైన నిద్రించుటకు వీలు కాకుండినచో, ఆ రాత్రి ఎంతసేపు నిద్ర తక్కువగా అగునో అందు సగకాలము మాత్రము మరునాడు పగటి భోజనానంతరము నిద్రించవచ్చు. అట్లు చేసిన క్రితం రాత్రి తక్కువ అగుట వలన కలుగు హాని తొలగును. కానీ ఈ అవకాశము తరచుగా ఉపయోగించుకోరాదు

పసిబాలురకు, వృద్ధులకు మాత్రం దివారాత్రము నిద్ర నిషిద్ధము కాదు. మనదేశ స్థితిని బట్టి నిర్వ్యాపారులకు, తగినంత పని లేనివారికిని 50 ఏండ్లు దాటిన పిదప మధ్యాహ్న కాలమున ఒక్క గంట నిద్రించిన తప్పు కాదు. ఈ విధముగా ఎండలు ముదిరిన తరువాతనే చేయవలెను.

ఈ మినహాయింపు చెల్లనివారు పగటిపూట పరుండినను, నిద్రించినను, బద్ధకము, సోమరితనము, మాంద్యము తటస్థించును కఫము, ప్రతిశ్యాయము (పడిశము), పీనస, క్షయ, ఉబ్బు, తలనొప్పి మొదలైన దుష్పరిణామములు కలుగును ; ఆకలి క్షీణించును, జీర్ణశక్తి తగ్గును, అరుచి ఏర్పడును కాలక్రమమున క్రొవ్వు పెరిగి స్థూలకాయులౌతారు.

కాబట్టి అతి నిద్ర పోరాదు. ప్రతి దినము బ్రాహ్మీ ముహూర్తము (అనగా బ్రహ్మ జిజ్ఞాసాధ్యయనాదులకు యోగ్యమగు రాత్రియొక్క కడపటి జాము నందలి రెండు గడియల కాలము) నందు నిదుర నుండి మేల్కొని ఆరోగ్యమును పొందుచూ ఆయువును కాపాడుకొనుము.




కొన్ని మానసిక కారణముల వలన నిద్ర లేనివారు, నిద్ర పట్టనివారు నిద్రమాత్రలు వాడుతుంటారు. ఇలా చేయుట ఆరోగ్యానికి హానికరము, ఒక్కోసారి ప్రాణాపాయము కూడా. సాధారణంగా ఇలా నిద్ర పట్టనివారు మానసికంగా నిద్రకు దగ్గరయ్యేలా ప్రయత్నించాలి గాని ఇలా మందుబిళ్లలు వాడటం శరీరానికి అంత మంచిది గాదు. తప్పనిసరిగా వాడాలి అనుకుంటే ఆయుర్వేదంలో చెప్పిన రీతిగా వివరించిన వైద్యచికిత్సలను చేసుకొని ప్రయోజనము పొందవచ్చు.

కాకిదొండ వేరు శిరస్సుపైన వేసి కట్టిన హాయిగా నిద్ర పట్టును ;

ఉత్తరేణి, గొబ్బి, కాసర ఈ మూడింటి వేర్లు కలిపి కషాయం పెట్టి త్రాగిన నిద్ర పట్టును ;

గసగసాల పాలను నిద్ర లేనివారు — తరచూ ఉపయోగిస్తే తప్పక నిద్ర పడుతుంది ;

గొబ్బి వేరును తలకు కట్టుకొనిన చక్కగా నిద్ర పట్టును.

# అవధానాల పట్టు - ఆదిభట్టు

ఆంధ్రదేశంలో అవధానాలంటే తెలియని వారెవరూ లేరు. అష్టావధానాలూ - శతావధానాలూ - నాట్యావధానాలూ - నేత్రావధానాలూ ఇలా ఎన్నో రకాల అవధాన ప్రక్రియలు అక్కడా - ఇక్కడా అడపాతడపా జరుగుతూనే వున్నాయి. పూర్వం చరిగొండ ధర్మన్న - శ్రీనాథుడూ అవధానాలు-ఆశుకవితలూ అందించనూవచ్చు.

డా॥ అయలసోమయాజుల గోపాలరావు

రామరాజభూషణుడు శతలేఖినీపద్య సంధ్యాధారేయుడే కావచ్చు. ఈ శతాబ్దిలో చూస్తే - తిరుపతి వెంకట కవులు - కొప్పరపు సోదరులు - ఇలా ఎందరో తెలుగు నేలపై అవధానాల పంట పండించేరు. అందుకే వానలో తడియనివారు మద్గురు వధాన మరంద మృదూక్తి ధారలో నడువనివారు మాకెచట గానగరారన్నారు విశ్వనాథ - తమ గురువులు తిరుపతి వెంకటకవుల అవధానాల గురించి. ఇవ్వాళకూడా చాలా విరివిగా అష్టావధానాలూ - చతుర్గుణిత దశగణిత అష్టావధానాలూ - శతావధానాలు, మన రాష్ట్రంలో నిర్వహింపబడుతున్నాయి. అంతేకాదు - సహస్ర - పంచ సహస్రావధానాల్ని కూడా జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి వంటివారు చేసేవారట.

ఆదిభట్టు నారాయణదాసుగారు కూడా ఎంతో క్లిష్టమైన అవధానాలు చేసినట్లుగా తెలుస్తోంది. "ఆదిభట్టు" అనగానే హరికథా పితామహునిగానే ప్రసిద్ధి. నిజమే, ఆయన తన జీవితాన్ని హరికథకే అంకితం చేస్తానన్నారు, చేసేరు. కానీ ఆయనకున్న బహుముఖ ప్రజ్ఞ మరెవ్వరిలోను కనపడదు. సంస్కృతంలో ఆంధ్రంలో - ఆంగ్లంలో ఇంకా అనేక భాషల్లో ఆయన పండితుడే కాదు, చక్కని కవి కూడానూ. సంగీతం సంగతి చెప్పక్కర్లేదు - ఆటపాటల మేటి. వీటితోపాటు ఆయన అష్టావధాన శతావధానాలు చేసినట్లు కనబడుతోంది. ఒకసారి (అర్ధ) సహస్రావధానం చేసినట్లు వారి శిష్యులద్వారా వినబడుతోంది.

అష్టావధానం అనగానే సాధారణంగా సమస్య-వర్ణన-దత్తపది-నిషిద్ధాక్షరి - న్యస్తాక్షరి - పురాణం - ఆశువు - అప్రస్తుత ప్రశంస - పువ్వులు లెక్కించడం - గంటలు చెప్పడం - చదరంగం - వీటిల్లో ఏవో ఎనిమిది అంశాలుండడం మనం చూస్తున్నాం ఇప్పటి అవధానాల్లో. కానీ, దాసుగారి అవధాన ప్రక్రియ ఇంతకంటె విశేషంగా విచిత్రంగా కనబడుతోంది. అవధానానికీ - అవధానానికీ ప్రక్రియ మారడంతోపాటు కష్టసాధ్యంగా కూడా అనిపిస్తోంది వారి విధానం.

దాసుగారు తన 19 వ ఏట హరికథలు చెప్తూ కుళం బరంపురం ప్రాంతాలు తిరిగేరు. అప్పుడే మొట్టమొదటగా ఛత్రపురం వద్ద లోకనాథం అనే గ్రామంలో అష్టావధానం చేసేరు. ఆ విధానాన్ని ఆయన ఇలా చెప్పేరు. "ముప్పది గంటముల కొక్కొక్క చరణముగా కోరిన పద్యములు - కవిత్వము చెప్పుటయు, ముప్పది రెండక్షరముల న్యస్తాక్షరి చేయుటయు, నోట నొక చిన్న లెక్కకు త్తరము చెప్పుటయు, పూవులు లెక్కించుటయు, కోరిన రాగముపై పురాణము చదువుటయు, గంటలు లెక్కించుటయు" (నా యెఱుక)

ఇదే సమయంలో బరంపురం నుండి పలాసాకు వస్తూ అక్కడి కామేశం పంతులుగారితో తిరిగేరు. 'లంబిడీపల్లి' గ్రామంలో వెళ్తూ దాసుగారు ఆ పంతులుగారితో కలిసి ఏభై గంటాలకు చెరొక పాదం చొప్పున ఏభై పద్యాల కవిత్వం ఆశువుగా చెప్పేరు. ఇదోరకమైన అర్ధ శతావధానం అనవచ్చు. ఇందులో సరిపాదాలొకరు బేసిపాదాలొకరూ చెప్పేరట.

తిరుగు ప్రయాణంలో శ్రీకాకుళం వచ్చి అక్కడో ఠరస్తవారుగారింట్లో దాసుగారు మరొక శ్రీవైష్ణవ పండితునితో కలిసి అవధానం గావించేరు. నలుగురికి తెలుగులో - నలుగురికి సంస్కృతంలో చెరొక చరణం ఎంతున పద్యం చెప్పడం, చెరొక ముప్పైరెండక్షరాల న్యస్తాక్షరి - తెలుగు ఛందస్సు గురించి ఇద్దరు మాట్లాడడం నిషేధాక్షరి ఇంతా మరికొన్ని ప్రక్రియలతో రెండు గంటల్లో పూర్తి చేసేరట.

దాసుగారి ప్రోత్సాహకుల్లో 'భీముడు' గారొకరు. ఇతని బావమరది వద్ద దాసుగారోసారి ఏడు రూపాయలు అప్పు తీసుకొని ఎప్పటికీ ఇవ్వలేదు. అందుకని ఆతడు దాసుగారిని - ఆయన తెలివినీ తక్కువచేసి మాట్లాడడం జరిగింది పౌరుషంతో దాసుగారు ఆ మర్నాడుదయం 8 గం॥ వెళ్ళి బాకీ తీర్చేస్తూ అప్పటికక్కడ వున్నవారినే పృచ్ఛకులుగా చేసి అష్టావధానం చేసి తన తెలివి ఎటువంటిదో తెలియజేశారు.

ఇలాగే విశాఖపట్టణం అల్లిపురంలో ఓ జమీందారు గారింట్లో విచిత్రమైన అవధానం చేసేరు దాసుగారు. గ్రీకు భాషలో ఏభై మాటలన్యస్తాక్షరి - పురాణం కోరిన రాగంలో గిరగిరా పుస్తకం త్రిప్పుతూ చదవడం 'అల్జీబ్రాలో' ఈక్వేషను సాధించడం - ఇద్దరికి తెలుగు ఇద్దరికి సంస్కృతంలో కవిత్వం చెప్పడం, పువ్వులు లెక్కపెట్టడం, నిషేధాక్షరి ఒక్కొక్క పాదం చొప్పున ఒకమారు చదివిన శ్లోకాన్ని మళ్ళీ చదవడం, ఛందస్సుతో మాట్లాడడం ఇలా జరిగిందా అవధానం.

రాజమండ్రిలో ఓ అవధానం నిర్వహించేరు. కందుకూరి వారు (విచిత్ర-వివాహ కర్త అని దాసుగారి వ్యవహారం కందుకూరి వారి గురించి) శాకుంతలంలోని "నఖలు నఖలు బాణః" శ్లోకాన్ని తెలుగు చేయ' మన్నారు దాసుగారు అచ్చ తెలుగులో -

" వలదు వలదయ్య యీ యిత్రి తవిరుమేన
నమ్ము వేయుట పూవుల కగ్గియిడుట -
లేడిపిల్లల విలుకడ లేని బ్రతుకు
లకట ఎచ్చట ! నీ వాడియలుగు లెచట !

బాల

సోమంచి రామం

# కలిమి చెలిమి

కలిమి బలము కన్న
చెలిమి కలిమి మిన్న ॥
చెలిమి లోని ఘనము
కలిమి లోన కనము ॥

చెలిమి లోని హాయి
కలిమి కేది భాయి ॥
కలిమి చేర భయము
చెలిమి చేయ జయము ॥

చెలిమి కూర్చు సుగతి
కలిమి కూల్చు జగతి ॥
కలిమి దెచ్చు నహము
చెలిమి యిచ్చు నిహము ॥

కలిమి పెంచబోయి
చెలిమి చంపకోయి ॥
కలిమి నిలుపబోయి
చెలిమి విడువకోయి ॥

కలిమి మది కోరకు
చెలిమి నెద వీడకు ॥
కలిమి నీడ చరము
చెలిమి చూడ స్థిరము ॥

## కష్టం

భగ్గున ప్రేలి
ఒడలు కాల్చి
చంపు
“ గ్యాసు స్టౌ ” !!

కె. కిశోరుబాబు
కె. అశోకుబాబు

అని చెప్పేరు. కందుకూరివారు తమ శాకుంతలానువాదంలో ఈ శ్లోకాన్ని రెండు పద్యాల్లో చెప్పేరు. “ ఈ చిన్న భావానికి రెండు పద్యాలనవసరం ” అని దాసుగారనడంతో ఇద్దరిమధ్యా మాటామాటా పెరిగిందంటారు

మరో విశేషం - ఇవాళ హరికథలపట్ల - ఒకరిద్దరి విషయంలో తప్ప జనాకర్షణ తక్కువనే చెప్పాలి. అటువంటిది దాసుగారు ఆ రోజుల్లో బరంపురంలో టిక్కెట్ పద్ధతిపై హరికథలు చెప్పేరు. అలాగే బందరులో టిక్కెట్ పద్ధతినే అష్టావధానం చేయడం గొప్ప విశేషం. ఇందులో 1) రెండు పాదాల రెండు తాళాలు రెండు చేతులా రెండు తాళాలు వేస్తూ పల్లవి పాడుతూ కోరిన జాగాకు ముక్తాయిలు వేయడం, 2) ప్రోబ్లెము మెంటల్గ సాధించడం, 3) నలుగురికి తెలుగులో నల్గురికి సంస్కృతంలో కోరిన పద్యాలు చెప్పడం. 4) వ్యస్తాక్షరి 5) న్యస్తాక్షరి. 6) ఇంగ్లీషులో ఉపన్యసించడం 7) పువ్వులు + గంటలు లెక్కించడం 8) ఛందస్సులో మాట్లాడడం ” దీనిని గురించి “ బుధ విధేయిని ” పత్రికలో “ చిన్న పనుల గుంపు ” అని వార్త ప్రచురిస్తే దాసుగారది చూసి “ అలా అనడానికి బదులు అసాధ్య అష్టావధానము - సంగీత సాహిత్యములతో ఇట్లవధానము చేయు సమర్థత ఇంకొక్కరికుండుట దుర్ఘటము ” అని ఏల వ్రాయకూడదంటూ ‘ కలుషహారిణి ’ పత్రికద్వారా విమర్శించేరు ఈ విషయంలో చాలవరకు తర్జనభర్జనలు జరిగేయంటారు.

ఆ రోజుల్లో గంజాం జిల్లా “ ఉర్లాంలో ” కవి పండితులకు మాత్రమే వార్షికముండేది. సంగీతజ్ఞులకు లేదు. అందుకని దాసుగారు అష్టావధానం చేసి వార్షికం పొందేరు.

దాసుగారు విజయనగరం మహారాజావారి సమక్షంలో ముడుంబై నరసింహాచార్యులగారితో కలిసి సహస్రావధానం చేసేరని వారి ప్రియశిష్యులు పేరి నరసింహశాస్త్రిగారు చెప్పేరు. వెయ్యిమంది పృచ్ఛకులు లేకపోతే - ఉన్నవాళ్లే ఒక్కొక్కరు పదేసి - పాతికేసి విషయాలిచ్చేరట. అవధానం పూర్తి అయాక ధారణ చేద్దామన్నారుట దాసుగారు. ఆచార్యులవారు పెద్దవయసు మూలాన మొదట్లో సందేహించినా - దాసుగారి ఉత్సాహాన్ని చూసి పూర్తిచేసేరుట.

ఓ సారి రాజావారు ఆశువుగా “ మానము ప్రేమ, లజ్జయును మాటికి బోరగ బ్రీతి మీరెడున్ ” అని దాసుగార్ని పూరించమన్నారు.

“ సానులయొద్ద నిచ్చకము సల్పుచు లొంగుచు నుంటక ర్హమౌ
దానము చేయకుంటకు వృధా దినముల్సరిపుచ్చు కొంటకున్
జ్ఞానియు జాణయైన తన నాధుని గగ్గొనుచున్న భార్యకున్
మానము ప్రేమ లజ్జయును మాటికి బోరగ బ్రీతి మీరెడున్ ”

అని పూరించి రాజావారి ప్రశంసలు పొందేరు. మరోసారి రాజావారు “ సతతము సంతస మెసంగు సత్యవ్రతికిన్ ” ఇచ్చి పూరించమంటే - అదే మకుటంగా దాసుగారు ఆశువుగా నూరు విధాలుగా పూరించేరు. ఇంకా ఇలాంటివి ఎన్నో చేసేరు.

ఇంతటి క్లిష్టమూ - అనితరసాధ్యమూ అయిన అవధానాల్ని పట్టుగా చేసిన దిట్ట మన ఆదిభట్టు.

జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః ★

# పుస్తకసమీక్ష

## హిందూత్వము మతముకాదు- జీవన విధానము

రచన: – శ్రీ భమిడిపాటి అనంతశర్మ
(జూనియర్ కాలేజి లెక్చరర్)
విస్సన్నపేట – 521215 కృష్ణాజిల్లా
వెల. రు. 4_00 పేజీలు - 60

ఈ చరాచర జగత్తులో సృష్టి పరిణామం విచిత్రమయినది. సృష్టిలో జీవుల పుట్టుక, మరణం మొదలైన విషయాలలో మనకు అనేక సందేహాలు కలుగుతుంటాయి. మతం ఈ సందేహాలకు సమాధానం చెపుతుంది. ప్రపంచంలో మనకు అంతుపట్టని రహస్యాల వెనుకనున్న మానవాతీతమైన శక్తిని భగవంతుడని మతం చెబుతోంది.

మన దేశంలో అనేక మతాలు పుట్టాయి ఆయా మతాలు పుట్టిన సందర్భాలకు ఆధారాలు ఉన్నాయి. కాని హిందూమతం అతి ప్రాచీనమైనది దీని ఆవిర్భావాన్ని మనం లెక్కించి చెప్పలేము. అంతేకాదు ఈ మతాన్ని ఏ ప్రవక్త ముందుగా ప్రతిపాదించలేదు. హిందూమతం పుట్టాకే ప్రవక్త ఏర్పడ్డాడు. శ్రీ అనంతశర్మగారు మానవుడి అంతిమ లక్ష్యాన్ని పరమ గమ్యాన్ని తెలియజేసే హిందూమతము యొక్క ఔన్నత్యాన్ని ఆధునిక చిత్తముల నాకర్షించు రీతిని అమోఘవచనములతో, విమర్శక దృష్టితో, శాస్త్రప్రమాణములతో నిందు విపులీకరించి యున్నారు.

ప్రధానంగా మతములో జీవుడు, మోక్షము, జగత్తు, భగవంతుడు అనే అంశాలు ఇమిడి ఉంటాయి ఈ పుస్తకంలో రెండు భాగాలు ఉన్నాయి. మొదటిది సిద్ధాంత విభాగమునకు సంబంధించినది ఇందులో హిందూత్వములోని ముఖ్య అంశాలు వివరించబడ్డాయి. సృష్టి, జన్మ, పాపపుణ్యాలు, పునర్జన్మ, మోక్షము, కర్మజ్ఞాన యోగాలను గురించి, పురుషార్థములను గురించి ఈ భాగములో ప్రస్తావించబడింది. శర్మగారు హిందూమత ప్రాశస్త్యాన్ని గురించి తెలియజేస్తూ అందుకు దృష్టాంతంగా వేదాలు, ఉపనిషత్తులు రామాయణ, భారతాది గ్రంధముల నుండి ఉదాహరణలిస్తూ సప్రమాణంగా ధర్మ తత్వాన్ని నిరూపించారు మన భారతీయ ధర్మాన్ని, సంస్కృతిని ప్రతిబింబించే విషయాలనెన్నింటినో హేతుబద్ధంగా వివరించారు.

రెండో భాగంలో హిందూ జీవన విధానంలో ధర్మానికి జీవితానికి ఉండే అవినాభావసంబంధాన్ని కళాసాహిత్య విజ్ఞాన పరంగా మన తత్వ శాస్త్ర రీత్యా చక్కగా వివరించారు. మానవుడికి భౌతిక సుఖాలతోపాటు ధర్మతత్పరతను కలిగించేది వివాహ వ్యవస్థ ధర్మాచరణమునకు ఆలంబములైన దాంపత్యము, సంతానము అనేవి మతాచారాలకు ఆధారములుగా భావించడంచేత జీవన విధానంలోని అంశాలకు, మతాచారాలకు విడదీయరాని సంబంధమేర్పడి మతమే జీవన విధానమయిందని తెలియజేశారు. నేడు విద్యావంతులైనవాళ్ళు సనాతనమైన మన మతము యొక్క గొప్పదనాన్ని గాని, ఈ మతంలోని ప్రాథమిక సిద్ధాంతాలను గాని తెలిసికోలేకపోవడం, కనీసం తెలిసికోవడానికి ప్రయత్నించకపోవడం దురదృష్టకరం. విదేశీ సులోచనాలతో ఈ దేశాన్ని వీక్షించే మేధావులు సహితం ఒక్కసారి ఈ పుస్తకాన్ని చదివితే మంచిది.

చిన్న వయస్సులో వివిధ శాస్త్రాలను అవలోకనము చేసి సులభ శైలిలో ఈ పుస్తకమును వ్రాసి ప్రచురించిన అనంతశర్మగారు అభినందనీయులు ప్రతి హిందువు విధిగా చదవతగిన పుస్తకమిది ప్రతి గ్రంధాలయములోను ఉండదగిన పారమార్థిక చింతనతో కూడిన లఘు గ్రంథం. "హిందూత్వం మతం కాదు – జీవన విధానం"

అనంతశర్మగారి కలం నుండి ఇటువంటి రచనలెన్నో వెలువడాలని ఆశిద్దాము.

— కొవ్వలి రామశేషు

బస్సులో వాళ్ళంతా దాదాపు గుంట్లకు పోయేవాళ్లే.

బస్ గంటన్నరలో భువనగిరి చేర్చింది. భువనగిరి బస్ స్టాండ్‌లో దిగిఅక్కడికి తుమ్మపూడి ఎంత దూరమో విచారించింది. కేవలం మూడు మైళ్ళ దూరమేనని తెలిసింది.

రాణి టాంగా ఎక్కింది. టాంగావాడు హుషారుగా ఈలవేసుకుంటూ తుమ్మపూడి రోడ్డును పట్టించాడు బండిని.




అది పేరుకు రోడ్డే కాని కేవలం డొంకలా వుంది అతి కష్టంమీద గతుకుల్లో బండి సాగుతోంది. రాణి మనస్సు పరిపరి విధాల పోతున్నది. ఒక్కసారి రవి తన్ను చూచి ఏమంటాడు ?

షాక్ తింటాడా ? లేక తల్లిదండ్రులకు "ఇదుగో నా కాబోయే భార్య" అని పరిచయం చేస్తాడా ? తల్లి దండ్రులు ఒప్పుకుంటారో లేదో ?

రవి మాటలను బట్టి వాళ్ళు పెద్ద ఉన్నవాళ్ల కారట. అలాంటప్పుడు తాను డబ్బిచ్చి ఒప్పించవచ్చు పేచీ పెడితే బెదిరించవచ్చు - పల్లెటూరు వాళ్ళకు పట్నం మనుషులంటే సహజంగా ఓ భయం వుంటుందంటారు - ...

లేక ఒకవేళ ఈపాటికే వాళ్లని ఒప్పించి పెళ్లి ప్రయత్నాలు చేశాడా ?

"రవీ ! నీ ప్రతిరూపం నాలో క్షణక్షణం పెరుగుతున్నదని" చెపితే ఏమంటాడు ?

పిచ్చి రవి ! సిగ్గు పడతాడా ? అమాయకంగా నవ్వుకొంటాడా ? తనకే చిన్న చేష్టలు పోలేదే -

తనకు మరో చిన్నవాడా ?

బండి ఒక్కసారి ఎత్తి కుదేసింది.

రాణి ఈ లోకంలోకి వచ్చింది

తుమ్మపూడి పొలిమేరలు వచ్చాయని బండివాడు చెప్పాడు ఊరు పేరుకు తగ్గట్టే తుమ్మచెట్లతో పరివేష్టితమై వుంది తుమ్మముళ్ళు చూచేసరికి ఎందుకో అప్రయత్నంగా శ్యాం గుర్తుకొచ్చాడు. ఈ వార్త వాడికి తెలిస్తే ఏమంటాడు ? ఎగిరిపడతాడా ? తన తండ్రితో స్టాడీలు చెపుతాడా ? - చెప్పినా ! ఈ ముష్టివాడు ఏం చేస్తాడు ? అమర ప్రేమ ఘనత ఏమిటో లోకానికి తాను మరొకమారు చాటాలి.

ఐన్‌స్టీన్ కాలాన్ని నాల్గవ కొలమానంగా నిర్వచిస్తే తాను ప్రేమే ప్రపంచానికి నాల్గవ అంచు అని చాటాలి. తల్లి ఏమనుకుంటుంది ?

" నా కడుపున చెడబుట్టావే " అని సినిమా డైలాగులు వల్లిస్తుందా ?

వల్లించుకోనీ !

ఆస్తి ఇవ్వనని తండ్రి బెదిరిస్తాడా ? పోనీ పాడు ఆస్తి - ఆ పుట్టబోయే వాడికే (దానికే) ఇచ్చుకోమను.

తామిద్దరూ డాక్టర్లు. రెండు చేతులా సంపాదించగలరు. రెండేళ్లలో తండ్రి భవనం కన్నా మరో అంతస్థు ఎక్కువది బరకత్‌పురాలోనే పోటీపడి కొనాలి తానూ రవీ కలిసి, అమెరికా, యునైటెడ్ కింగ్‌డం, వెళ్ళి రావాలి ఖోరానాకు వచ్చినట్లు ఓ నోబుల్ ప్రైజ్ రావాలి. అది చూసి జాతిమొత్తం గర్వించాలి. తమ గొప్పతనమేమిటో అప్పుడు తెలియాలి వాళ్లకి. తానేం వెర్రి కుట్టిననుకున్నారేమిటి వీళ్ళు ?

" అమ్మా బండిని ఎక్కడకి తీసుకుపొమ్మంటారు ? తుమ్మపూడి ఊళ్ళోకే వచ్చింది "

ఊరు చాలా చిన్నది. అక్కడక్కడా పెంకుటిళ్ళున్నా ఎక్కువ భాగం గుడిసెలే ఉన్నాయి.

ఒక పాలేరు పోరగాడు ఆకుచుట్టను పీలుస్తూ పోతున్నాడు " ఏయ్ - ఇక్కడ రవిగారిల్లు ఎక్కడ ?"

వాడు నిలబడిపోయాడు. బండినీ ఈమెనూ పరకాయించి చూస్తున్నాడు.

టాంగావాడు గద్దించినట్లు ఉర్దూలో అన్నాడు "అడిగితే దిక్కులు చూస్తావేమిరా. ఆ అయ్యగారిల్లు ఎక్కడో నీకెరికేనా? "

ఆ పిల్లవాడు ఊడిపోతున్న తలపాగాను మళ్లీ సరిచేసుకుంటూ " రండి చూపిస్తా " నని చెయ్యి ఊపాడు. రాణి టాంగావాడికి అయిదు రూపాయలు ఇచ్చింది. " వెళ్లమంటారా అమ్మా "

( జ రి గి న క థ )

డా॥ రాజుతోపాటు పైకెళ్ళిన వాళ్ళిద్దర్ని రాజు కూర్చోమన్నాడు. సమ్మక్క తన్ని తాను పరిచయం చేసుకుంది. రాజు సారిని పరీక్షచేసి విషయం చేతులు దాటిపోయిందన్నాడు. అక్కాచెల్లెళ్ళు ఇద్దరూ రాజు కాళ్ళు పట్టుకున్నారు దయామూర్తిలా అవతారం వేసి సారిని ఆమెకు పుట్టబోయే బిడ్డని అనాథశరణాలయంలో చేర్పిస్తానని బయటవాళ్ళకి సారి చనిపోయిందని చెప్పమన్నాడు. ఆమాత్రానికే వాళ్ళు పొంగిపోయి రాజు కాళ్ళని కన్నీళ్ళతో అభిషేకించారు రాణి ఆ రోజు ముఖం కడుక్కుంటూ వాంతి అయింది. Post కోసం ఎదురు చూసింది- రాణి వాళ్లమ్మ కళావతి గర్భం దాల్చింది. రాజుకది చాలా ఆనందంగా ఉంది. తప్పని సరిగా వాళ్ళతో షాపింగ్‌కి వెళ్లాల్సివచ్చింది రాణి. రాణికెందుకో ఆ వేడుకలన్నీ తనకే చేస్తున్నట్లున్నయి. ఫ్రెండ్ పెళ్లికని చెప్పి రవి వాళ్ళవూరు భువనగిరి వెళ్ళటానికి యాదగిరిగుట్ట పోయే బస్సు ఎక్కింది

( ఇక చదవండి)

వెళ్లమనాలా ? వద్దా ? ఒక్కక్షణం ఆలోచించింది. "ఇదుగో చూడు - ఓ అరగంటలో నీకు కబురు పెడతాను. ఈ లోపల గుర్రాన్ని కాస్త కట్టేసుకొని విశ్రాంతి తీసుకో "

" అట్టాగేనమ్మగారూ ఈ చెట్టు కింద తొంగుంటాను. మళ్ళీ మీరు వస్తే నా బండిలోనే పోదాము "

తాను మళ్లా ఇప్పుడే వెళ్ళవలసి వస్తుందా ?

లేక రవి ఇక్కడే వుండిపొమ్మంటే ....

ఎంత తాను రవి అర్ధాంగి కాబోతున్నా, పెళ్ళికాక ముందే ఎలా ఉండిపోతుంది ఇక్కడ ?

తుమ్మపూడిని చూసేసరికి ఆమెకు అసహ్యం వేసింది. జాతిరత్నాలు ఇలాంటి పల్లెటూళ్ళలోనే జన్మిస్తారు కదా !

తన తండ్రికూడా విశాఖపట్నం దగ్గర ఓ పల్లెటూళ్లోనే పుట్టాడు కాని నగరానికి వచ్చి గొప్పవాడైనాడు.

" ఈ తుమ్మపూడిలో విద్యావంతులు ఉండలేరు బాబూ! రవిని ఏడిపిస్తాను భలే ఫుందోయ్ మీ పూరూ అని పోరగాడు ఓ పెంకుటిల్లు చూపి వెళ్లిపోయాడు పెద్ద ప్రాకారం - బయట వ్యవసాయపు పనిముట్లు - గడ్డివాములూ - భూస్థితి ఉన్నట్లే కనపడింది రవికి రాణికి కొంచెం సిగ్గువేసింది.

ఏమని తాను లోనికి వెళ్ళి పరిచయం చేసుకోవాలి ? ఎవరు నువ్వంటే ఏం చెప్పాలి ?

మళ్ళా ధైర్యం కూడదీసుకొని గుమ్మం దగ్గరికి వెళ్ళి తొంగి చూచింది లోపల హడావుడిగా వుంది బంధువులు అటూ ఇటూ తిరుగుతున్నారు.

రాణి మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ లోపలికి నడిచింది. ఎవరో బంధువు ఈమెను చూచి " ఎవరు నీవని " కూడా ప్రశ్నించకుండా వచ్చి పెట్టె నందుకొని " రండమ్మా కాళ్లు కడుక్కోండి వడ్డిస్తున్నారు " అని చెప్పి లోపలికి నడిచాడు. రాణి యాంత్రికంగా కాళ్లు కడుక్కొని వరండా లోపలికి వెళ్ళింది

వచ్చిన కొత్త వ్యక్తిని వాళ్ళు చూచారు. ఎవరో బంధువు వచ్చిందనుకున్నారు. ఎవరి బంధువో ఎవరికి తెలుసు ?

ఓ ముసలాయన దగ్గరికి వచ్చాడు

పరికించి రాణిని ఓసారి చూచాడు. చిన్నగా నవ్వి " పోల్చుకోలేకపోతున్నానమ్మాయ్ " అన్నాడు

" నేను రాణిని, రవికి స్నేహితురాలిని "

" ఓహో అట్లాగా రామ్మా సంతోషం - అరేయ్ రవీ మీ దోస్త్ ఎవరో వచ్చారు చూడు "

ఈ మాటతో తాను వచ్చింది రవి ఇల్లేనని ఖాయం చేసుకొంది. ఇల్లంతా వేడుకగా వుంది గడపలకు పసుపులూ మామిడాకుల తోరణాలు ఆలోచించే లోపలే రవి వచ్చాడు. రాణిని చూచాడు.

" అరే రాణీ నీ విలా వచ్చావేమిటి ? జాబైనా వ్రాయలేదే "

రాణి ప్రతి సమాధానమియ్యలేదు.

" సరే కాళ్ళు కడుక్కో భోం చేసి మాట్లాడుకుందాం. నాన్నా ఈమె నా స్నేహితురాలు, క్లాస్‌మేట్ ఈ ఫంక్షన్‌కి రమ్మన్నాను. వస్తున్నట్లు జాబైనా రాయకుండా హఠాత్తుగా వచ్చింది "

ముసలాయన రవి తండ్రి అన్నమాట. నవ్వి " రా బిడ్డా రా లోపలికి " అని ఆత్మీయంగా పిలిచి ముందుకు సాగాడు

రాణికి తల తిరిగినట్లనిపించింది

ఏ ఫంక్షనుకు తన్ను రవి పిలిచాడు ?

తాను దేనికి వచ్చిందిప్పుడు ?

లోపలనుంచి పొత్తిళ్లల్లో బిడ్డను పట్టుకొని ఒకామె వచ్చింది

" అమ్మాయ్ ఇదుగో పట్నంనుంచి మన రవి దోస్త్ ఎవరో వచ్చిన్రు - రా ఇటు " ముసలాయనతో సంభాషణ విన్న బంధువులొకరు ఒకామెను తీసుకొని వచ్చారు. " ఈమె రవి భార్య, బిడ్డను చూడండి. అచ్చంగా రవి పోలికే కదూ " రవి తండ్రి పానయ్య రాణికి రవి భార్యనూ కొడుకునూ చూపిస్తున్నాడు.

రాణి చేతులు మూర్ఛల రోగికిమల్లే ఎగుసుకొని పోయాయి.

ఎదురుగా ఆమెకేమీ కనపడటం లేదు పసిపాప 'కేరు కేరు' మని ఏడుస్తున్నది " లక్షిందేవి అని అమ్మవారి పేరే పెట్టినామండీ గుట్టకు యాత్ర చేసి నాకనే బిడ్డ పుట్టింది " రవి భార్య రాణికి నాటి నామకరణోత్సవాన్ని వివరిస్తున్నది

" పదమ్మా వద భోం చేసి మాట్లాడుకోవచ్చు " ఎవరో పిలిచారు — తానేం చేసింది ?

వెళ్లి వంక్తిమీద కూర్చుందా ?

వాళ్ళు వడ్డిస్తున్నారా ?

తాను తింటున్నదా ? లేదా ?

రాణి ఏమి చేస్తున్నదో రాణికే తెలియదు.

అంతా భోజనానంతరం తాంబూలాలు వేసుకున్నారు. రవి అప్పుడు మళ్లీ కనపడ్డాడు.

( సశేషం )

# తుది వీడ్కోలు

ఇలా పరమాద్భుత ఉత్సవాన్ని సంఘటించిన వ్యాస భగవానుణ్ణి కొలుస్తూ, ధృతరాష్ట్రుడు పాండవులు ఆశ్రమ భూమికి తిరిగి వచ్చారు. తమతో వచ్చిన తపస్సుల దగ్గర సెలవు తీసుకొన్నారు.

అప్పుడు పరాశరుడు ధృతరాష్ట్రునితో ఇలా అన్నాడు. "వేదశాస్త్రాల నన్నింటిని విజ్ఞులైన మహామునీంద్రులు చెప్పగా, వీనుల విందుగా, విన్నావు నీ కన్న ఎంతో వైభవంగా దివ్యమైన సౌఖ్యాలను అనుభవిస్తున్న కొడుకుల్ని కన్నులార చూచావు. వారికోసం ఇక బెంగ అవసరం లేదుకదా !

"ఈ ధర్మరాజు ఈ నెల నుంచీ నిన్ను కొలిచి ఉంటూ, నిష్ఠతో ఈ వనభూమి లోనే ఉండిపోయాడు. ఇక ఈ రోజుకు వెనుకకు మరలి వెళ్ళమనడం న్యాయమే కదా !"

"మీ కృపా విశేషంవల్ల కృతార్థుడనయాను. మీరు అనుమతించినట్లు అలాగే చేస్తాను." అని ధృతరాష్ట్రుడా మహామునికి ప్రణమిల్లాడు. పాండవులు కూడా ఆయన వద్ద సెలవు తీసికొన్నారు. అందరను దీవించి అంతర్హితు డయాడు వ్యాసభగవానుడు.

అంబికేయునికి ఇప్పుడు ఏ విచారమూ లేదు ధర్మ రాజును ప్రీతితో పిలిచాడు. అతనితో ఇలా అన్నాడు.

"నాయనా ! ధర్మజా ! నీవు అనుదినము కొల్వులో ఉండి పరిష్కరించవలసిన రాచకార్యాలెన్నో ఉంటాయి. మరి ఇలా ఇక్కడ ఉండిపోవడం న్యాయమేనా ? భీష్మాది ప్రముఖుల వలన వినదగిన ధర్మములను, ధర్మ సూక్ష్మము లను, అన్నింటినీ వినే ఉన్నావు. సమగ్రమైన ధర్మా న్నెరిగిన నీవు ఇక ఎవ్వరివల్ల ఎట్టి ఉపదేశాన్ని పొంద వలసిన అవసరం లేదు. ఎక్కడా, ఎట్టి ధర్మాతిక్రమ ణాన్ని సహించని జనం నీ కోసం రాజధానిలో వేచి ఉంటారు. వెంటనే దార సోదర సహితంగా హస్తినా పురానికి బయలుదేరు. నీవల్ల నా శోకం అంతా తీరి పోయింది. మనస్సు ఇప్పుడు నిర్మలంగా ఉండి తపస్సుకై తహతహ లాడుతోంది. ఈ తపస్సు నాకు ఎట్టి బాధను కష్టాన్ని కల్గించదు. అందుచేత నీవు నీ మనసున నాకై ఎట్టి శంకను, విచారాన్ని పెట్టుకోకు ; నన్నిక్కడ అతి నిష్ఠగా నిలిచిపోవడానికి నీ సమ్మతిని తెలియపరచి, ఈ పుర జనులకు, సైనికులకు ఉత్సాహాన్ని కల్గించి, శీఘ్రముగా రాజధానికి ప్రయాణమయి, రాజ్య భారాన్ని వహించు."

---

**వడలి మందేశ్వరరావు**

---

ధర్మరాజు వృద్ధరాజు మాటలను విని ఇలా అన్నాడు. "ఓ మహారాజా ! రాజ్యాన్ని పాలించడానికి, రక్షించ డానికి, నా తమ్ములు ఈ భీమాదులను వియోగించు, నేను నిన్నూ, మా తల్లులనూ, కొలిచి ఉంటూ నీ పాదాలదగ్గరే నిలిచి ఉంటాను. మీ తపస్సుకు అనుగుణంగా మీకు శుశ్రూషణము చేస్తూ, నియమంగా నేనూ తపస్సుకు పూనుకుంటాను."

గాంధారి ధర్మరాజుకు నచ్చచెప్పడానికి ఇలా అంది. "నాయనా ! ఇలా అనడం ఏమయినా బాగున్నదా ? కురుకులానికి అంతటికీ రక్షకుడవు నీవే కదా ! తండ్రులకు సద్గతి కల్గడానికి కర్మను చేయడానికీ కర్తృత్వం నీ మీదనే ఉన్నది అందుచేత మీ తండ్రి చెప్పినట్లు చేయి. పౌర జనానికి నిరాశను కలిగించకు. నీవు అలా వెనుకకు వెళ్ళడమే మాకు ఎంతో ప్రియాన్ని చేసినట్లవుతుంది."

గాంధారి మాటలను విన్న ధర్మరాజు, తన తల్లి కుంతి వైపు తిరిగి ఇలా విన్నవించాడు.

" అమ్మా ! మీ రెంత తరిమినా మిమ్మల్ని యీ అడవిలో విడిచి వెళ్లిపోవడానికి నా మనసు ఏమీ అంగీకరించడం లేదు. వెనుకటివలె నాకు ఇప్పుడు కించిత్తు కూడా రాజ్యకాంక్ష లేదు. ఆ రాజ్యంలో ఏమున్నదమ్మా ! పాంచాలురు లేరు, మాత్స్యులు లేరు – నా అన్నవారు ఎవరూ లేనే లేరక్కడ ! అదీ గాక, యుద్ధం ముగిసినప్పటినుంచీ నా మనస్సు తపస్సు చేసుకోవడానికే మొగ్గుతోంది. ఆ తపస్సే నాకు ఉత్సాహాన్ని కల్గించేటట్లు ఉంది!"

సహదేవుడు అన్న మాటను విని, " నీవెందుకయ్యా ! నేను ఈ ఆశ్రమంలో ఉండిపోయి, తపస్సు చేసుకుంటూ, మీరందరికీ శుశ్రూష చేస్తాను " అన్నాడు.

చిన్న కొడుకు మాటలకు కుంతి మనసున నున్న వాత్సల్యమంతా ఒక పొంగులా ఉబికి వచ్చింది. ఆతణ్ణి అక్కున చేర్చుకొన్నది. " మా మీద భక్తితో మీరిలా అంటున్నారే కాని, మీరిక్కడ ఉండడంవల్ల మా తపస్సుకు విఘ్నమే కలుగుతుంది కాని, మాకు నియమ విధి సమాచరణముల మీద ఏకాగ్రత ఎలా కలుగుతుంది ? అంచేత ఈ మహారాజు మాటను పాటించడమే న్యాయం కాని, ఇక్కడ ఉండిపోవడం ఉచితమైన పని కాదు. మీకు సర్వకార్యములయందు శుభము కల్గుతుంది. పోయిరండి!"

కుంతి మాటలను విన్న ధర్మరాజు మరోమాట అనడానికి లజ్జించాడు, సంకోచించాడు. అతడు ధృతరాష్ట్రునితో " తపోమహనీయులైన మిమ్ములను కొలిచి, గతకల్మషుడనయాను. మీ ఆజ్ఞను శిరసావహిస్తున్నాను. పురమునకు పోయివస్తాను " అన్నాడు.

ఆ కురు వృద్ధు సంతోషించాడు ; ఆతనిని అలింగనము చేసికొని మనసార దీవించాడు భీముణ్ణి స్వాంతన వచనాలతో ప్రీతుణ్ణి చేసాడు ; అర్జునుణ్ణి కొనియాడాడు ; కవలను యథోచితంగా గారవించాడు. అందరినీ కౌగలించుకున్నాడు. పాండవులందరూ అతనికి ప్రణమిల్లి ఆశీర్వాదాలను పొందారు.

తర్వాత వారు గాంధారికి నమస్కరించగా, ఆమె వారిని అక్కున చేర్చుకొని దీవించింది. కుంతి పాదాలకు వారు మ్రొక్కగా, ఆమె అందరను ఒక్క కౌగిట చేర్చి, ఒక్కొక్కరినీ విడివిడిగా ఆశీర్వదించింది.

ద్రౌపది మొదలయిన స్త్రీజనమంతా యథోచితంగా అత్తమామల వద్ద సెలవు తీసికొన్నారు.

తర్వాత పరిజనము, పౌరులు సంతోషముతో తమ్ము కొలుస్తూండగా, పురజనులందరికీ కన్నుల పండువుగా పాండవులు హస్తినాపురం చేరుకున్నారు.

హస్తినాపురంలో పాండవులు 'సముచిత వర్తనంబుల' నుండగా కొంత కాలానికి ఒకనాడు నారద మునీంద్రుడు సోదరులందరితో కూడి ఉన్న ధర్మరాజు దగ్గరకు వచ్చాడు. పాండవులా మహాత్మునకు భక్తితో నమస్కరించారు ఆసనాన్ని అర్పించారు; అర్ఘ్యపాద్యాదులతో సత్కరించారు. ఆయన సమీపానే ఆసీనులయారు. ఆయన మొగము వంక చూస్తూ, ప్రత్యక్షరాన వినయం ప్రకాశిస్తుండగా, ధర్మరాజు " ఓ మహాభాగ ! మీరెక్కడనుంచి వస్తున్నారు ? మీ రేయే దేశాలను చూచి వచ్చారు ? నేను మీకు చేయదగిన పని ఏమయినా ఉంటే, ఆజ్ఞాపించండి ! " అని అడిగాడు.

అప్పుడు ఆ పరమ సంయమి, ఆ పుడమి రేనితో ఇలా అన్నాడు.

(సశేషం)

# మంత్రి సీతారామయ్యర్

"కృష్ణదాసస్వామి రేపటిదినం మన వూరు వస్తున్నారు" అంటూ ఎంతో సంబరంతో ఆ పల్లె పిల్లలు, తల్లులు వారి రాకను నిరీక్షిస్తున్నారు. గ్రామ పెద్దలు స్వాగతోత్సవ సన్నాహాలు చేస్తున్నారు.

ఆ సన్నాహాల్లో ఆడంబరాలు లేవు. స్వామివారు కూర్చునేందుకు పీట వేశారు కుమ్మరి వద్దకు వెళ్ళి ఓ కొత్త మూకుడు తెచ్చి దాని నిండా అన్నం, మరో మట్టి చట్టి నిండా పెరుగు కృష్ణదాసస్వామివారికి సమర్పించడం సంప్రదాయం. అదే వారి ఆహారం. రోజుకొక పూట మాత్రమే వారు ఆహారం తీసుకొనేవారు.

ఉదయం తొమ్మిది గంటలకల్లా స్వామి గ్రామానికి విచ్చేశారు. దారిలోని కొలనులో స్నాన సంధ్యావందనాది కార్యక్రమాలను ముగించి 'గోపాలా' అంటూ గ్రామప్రజల వద్దకు వచ్చారు. భక్తులు 'గోపాలునికి దండం పెట్టండి' అన్నారు.

అందరూ 'గోపాలా, గోపాలా,' అంటూ మోకరిల్లి చేతులు జోడించి నిల్చున్నారు. చట్టిలోని పెరుగును మూకుడులో వేసి కలిపి, మౌనంగా గోపాలునికి నివేదించి, చిన్న వుండలు చేసి అక్కడున్న పిల్లలకందరికీ పెరుగన్నం పంచిపెట్టారు, "మాకు చాలు. మీరు తినండి" అంటూ పిల్లలందరూ ఒక్కపెట్టున స్వాములవారి నర్థించారు మిగిలిన కాస్త అన్నాన్ని దాసుగారు సేవించి కాసేపు సమీపంలోని చెట్టుకింద విశ్రమించి, కమండలం చేత తీసుకుని బయలుదేరారు గ్రామంలోని పురుషులు, స్త్రీలు, పిల్లలూ అందరూ స్వాములవారికి పాదాభివందనం చేసి ఆశీస్సులందుకుని వారికి వీడ్కోలు పలికారు.

* * *

కృష్ణదాసస్వామివారి పూర్వాశ్రమ నామధేయం సీతారామయ్యర్. రంగపురంలో పేరుమోసిన న్యాయవాది. తమ ముప్పయ్యో ఏట వకీలు వృత్తిని వదలుకుని జాతీయోద్యమంలో దూకి జైలుకు వెళ్ళారు.

తండ్రి వయసు మళ్లినవారే కాక వ్యాధిగ్రస్తుడు. భార్య ఆరోగ్యం కూడా అంతమాత్రమే. తమ్ముడు చాలీ చాలని జీతంపై గుమాస్తాగిరి సాగిస్తున్నాడు.

"అన్నయ్య వకాల్తా మానుకుని స్వాతంత్రోద్యమంలో పాల్గొంటారట" అని తమ్ముడు నారాయణ తండ్రిగారికి చెప్పాడు.

---

జానమద్ది హనుమచ్ఛాస్త్రి

"అబద్ధం, అబద్ధం, యిలా అబద్ధాలు చెప్పి ఎగతాళి చెయ్యకు" అన్నాడు తండ్రి. "లేదు నాన్న ! నే చెప్పేదంతా నిజం" అన్నాడు నారాయణ.

తన నిర్ణయాన్ని సీతారామయ్యర్ భార్యకు వినిపించాడు. ఆమె కన్నీరు కార్చింది.

"దేశాన్ని కాపాడుకోవాలి. నీకే విషయం తెలియదు" అంటూ భార్యను ఓదార్చాడు అయ్యర్.

"శంకరలింగం శెట్టిగారు మన కుటుంబాన్ని అన్ని విధాలా ఆదుకుంటారు మీరేమాత్రం భయపడకండి" అని చెప్పి సీతారామయ్యర్ ఉత్తరదేశం వెళ్లాడు.

* * *

కేసు విచారించిన న్యాయమూర్తి సీతారామయ్యర్ పై రాజద్రోహనేరం రుజువైందంటూ, నాలుగేళ్ళ కారాగార శిక్ష విధించారు అయ్యర్‌ను నాగపూర్ జైలుకు తీసుకెళ్లారు.

జైలు జీవితంలో మూడేళ్లు ముగిశాయి. తండ్రిగారు దీర్ఘవ్యాధి పీడితులై ఆరు నెలలపాటు మంచంలోనే వుండి కన్నుమూశారు. అని తమ్ముడు జాబు పంపాడు.

మూడు రోజుల తర్వాత జైలు అధికారి టెలిగ్రాంను అయ్యర్‌కిచ్చాడు. తండ్రిగారి అంత్యక్రియలన్నీ తమ్ముడే జరిపించాలని కోరుతూ వ్రాసిన జాబు జైలు అధికారుల ద్వారా పంపటం జరిగింది.

*  *  *

ఆ తర్వాత ఏడాది చివర భార్య ఆరోగ్యం కూడా బాగా దెబ్బతినింది. చాలా ప్రమాద పరిస్థితి అని జాబు వ్రాశారు. ఎనిమిది రోజుల తర్వాత ఆ జాబు అయ్యర్ చేతికందింది. 'అంతా దైవేచ్ఛ' అన్నాడు సీతారామయ్యర్. కొత్తగా వచ్చిన జైలు అధికారి మంచివాడు. పెరోల్ మీద కొంతకాలం మిమ్మల్ని వదలిపెట్టమని పై అధికారులకు వ్రాస్తానన్నాడా అధికారి.

'అక్కర్లేదు' అన్నాడు అయ్యర్.

"నేను వెళ్లి మాత్రం ఏం చేయగలను ? అంతా దైవ సంకల్పం. చచ్చినవారెలాగూ మళ్ళా రారు కదా !" అన్నాడు అయ్యర్. అదీ ఆనాటి దేశభక్తుల దీక్ష. ప్రభుత్వం నుండి ఏలాంటి దయా దాక్షిణ్యాలను ఆశించకూడదని వారి నియమం.

*  *  *

నాలుగేళ్లు పూర్తిచేసిన తర్వాత విడుదలయ్యాడు. కాని మరల ఉద్యమంలో పాల్గొని పలుమార్లు జైలు శిక్ష అనుభవించాడు అయ్యర్.

*  *  *

1937 లో మద్రాసులో కాంగ్రెస్ మంత్రి వర్గం ఏర్పడింది. అప్పటికి సీతారామయ్యర్‌కు ఏబదేళ్లు. అయ్యర్‌ను మంత్రి వర్గంలో చేర్చుకుని విద్యాశాఖ కేటాయించారు అయ్యర్ సమర్థుడైన మంత్రి అని ప్రశంస లందుకున్నాడు.

"తండ్రిగారుంటే ఎంత సంతోషించేవారో !" అన్నాడు శంకరలింగం శెట్టి. సీతారామయ్యర్ కళ్లు అశ్రుపూరితాలయ్యాయి.

అయ్యర్ తన భార్యను తలచుకొని, శెట్టిగారు చెప్పిన మాటల్లో వాస్తవం వుందని బాధపడ్డాడు. శెట్టిగారు భార్యను గురించి ఏమీ పలుకలేదు. అది భారతీయ సంప్రదాయం.

*  *  *

రాత్రుల్లో అప్పుడప్పుడు అయ్యర్‌కు కలలొస్తుంటాయి. తండ్రిగారు యింకా జీవించే వున్నారని భ్రాంతి నిద్ర మేల్కొని తండ్రిగారిని గురించిన తలపులు ముసురుకోగా దుఃఖాన్ని ఆపుకోలేక ఏడ్చేవాడు అయ్యర్

"నాయనా, సీతారామా ! నన్ను వదలి వెళ్ళావు కదయ్యా ఇదేం న్యాయం ? నాకు దిక్కెవరయ్యా తప్పక వస్తావు కదూ" అంటాడా తండ్రి.

"నే నెన్ని బాధలు పడ్డానో తెలుసా ండి ?" అంటుందా భార్య కన్నమ్మ కన్నీరు కారుస్తూ

"నీవు కన్నుమూశావనుకున్నా. బ్రతికే వున్నావా ? నా వ్యథ అంతా అబద్ధమైంది" అన్నాడు సీతారామయ్యర్.

"నా పొట్టలో గొట్టం దూర్చి ఓ పెద్ద బక్కెట్ నీరును తీశారు. దిక్కులేని దానివలె ప్రాణాలు వదిలాను" అన్నది భార్య.

సీతారామయ్యర్ దుఃఖాన్ని ఆపుకోలేకపోయాడు. వెక్కి వెక్కి ఏడుస్తూ పెళ్ళాన్ని కౌగలించుకొని ఏడ్చాడు.

"సీతారామా ! ఇది కల కాదురా ! ముసలి తండ్రిని వదలి వెళ్లిన ద్రోహివిరా నీవు ! నీకు నరకం తప్పదు!" అన్నాడు తండ్రి.

సీతారామయ్యర్ వణికిపోయాడు. "రామా, నేనేం చేయను. నీవు అయోధ్యను వదలి అడవులకు పోలేదా ? ముసలి తండ్రిని వదలి వెళ్లలేదా ?" అంటూ సీతారామయ్యర్ అయోధ్యరాముని కాళ్లపై పడి ఏడ్చాడు.

ప్రక్కనున్న ఆంజనేయుడు ఫక్కుమని నవ్వాడు. అయ్యర్, అటువైపు చూచాడు.

"నీ కర్తవ్య మేమిటో నీకు బోధ పడింది కాదు. సుక్షత్రియుడైన రాఘచంద్రునిలా చేయటం నీకు సాధ్యమా ? తండ్రినీ భార్యను శంకరలింగం శెట్టిగారి, దయాదాక్షిణ్యాలకు వదలిపోవటమా ? నీవు అల్పుడివి !" అంటూ కోపంతో చూచాడు ఆంజనేయుడు.

"నేను ఘోరమైన పాపం చేశాను. భరించలేను. భగవాన్ నీవే గతి" అంటూ ఏడ్చాడు.

"ధర్మమేమిటో, కర్తవ్యమేమిటో తెలుసుకోక మోసపోయాను. గోవిందా నీవే దిక్కు" అన్నాడు.
"ప్రతి పైసా కూడబెట్టి నీకు చదువు చెప్పించాను. చేయరాని పనులు చేసి పాప భారాన్ని మోస్తూ, పట్నంలో నీ చదువుకోసం ప్రతి నెలా పైకం పంపేవాణ్ణి కదా!" అన్నాడు తండ్రి.

"నా కాళ్ళు వాపెక్కి, నిలువడానికి కూడా వీలు లేకుండా బాధ పడుతున్నప్పుడు, నీవు దేశభక్తి అన్న గర్వంతో నన్ను మరచి, ఎవరో ఆడించినట్లల్లా తాండవ మాడావు. నీ పితృద్రోహం ఎలా అంతరిస్తుంది?" అన్నాడు తండ్రి మరో మారు.

"అయ్యో, అలా శపించకండి. అందరివలె మీ కుమారుడు కూడా" అంటూ కన్నీరు రాల్చింది భార్య కన్నమ్మ. కలలో ఆమె దేవతామూర్తిలా కనిపించింది అయ్యర్‌కు.

"గోవిందా!" అంటూ మృదువుగా అన్నదామె. కృష్ణుడు ప్రత్యక్షమయ్యాడు.

"నీ పాపాలన్నీ పరిహారమవుతాయి. భయపడకు. ఇటురా - రథంలోకి" అన్నాడు కృష్ణుడు.

* * *

మరుసటిరోజు సీతారామయ్యర్ మంత్రి పదవికి రాజీనామా చేశాడు. వూరు వదలి వెళ్ళాడు. మంత్రి సీతారామయ్యర్, కృష్ణదాసుగా మారాడు. రోజూ ఒక గ్రామానికి వెళ్లి ఒక పూట మాత్రమే భిక్షమెత్తుకుని తింటూ పరదేశిలా రోజులు గడిపాడు. రెండేళ్ల తర్వాత, గోకులాష్టమి రోజున దివంగతుడయ్యాడు.

(మూలం : రాజాజీ : ఈ కథ 1985 డిసెంబర్ 'కస్తూరి' కన్నడ మాసపత్రిక నుండి తెనుగు

# నీతిమంజరి

శ్లో॥ ఏకోపి గుణవాన్ పుత్రో,
నిర్గుణైశ్చ శతైరపి
ఏకః చంద్రః ప్రకాశేన,
నక్షత్రైః కిం ప్రయోజనమ్

ప. మూర్ఖులున్న నేమి దుర్గుణులగువారు
సుగుణవంతు డొక్క సుతుఁడు చాలు
తారలెన్ని మింటఁ దళుకు మన్ననుగాని
యొక్క చందమామ శుద్ధియగునె?

శ్లో॥ అసంతుష్టో ద్విజో నష్టః
సంతుష్టోపి చ పార్థివ
స లజ్జా గణికా నష్టా
నిర్లజ్జాపి కులాంగనా

ప. తృప్తిఁ బొందకున్న ద్విజుఁడు నష్టమునొందు
తృప్తిఁబొంది రాజు వృద్ధిఁ గనఁడు
వ్రీడకలిగి వేశ్య, వ్రీడవీడి గృహిణి
నష్టపడుటపుడమి స్పష్టమెపుడు

శ్లో॥ ఉత్సాహస్సాహసం ధైర్యం,
బుద్ధి శ్శక్తిః పరాక్రమః
షడైతే యత్ర తిష్ఠన్తి,
తత్ర దేవోపి తిష్ఠతి

సాహసోత్సాహ, ధృతి, బుద్ధి, శక్తి, విక్రమంబు లాఱు నెవనియందు మగ్నమగునో
యతనియందు నిలచి పరమాత్మకుండు
కీర్తి సంపదలిచ్చి రక్షించు సతము.

— పృథివి సుబ్బనాగయ్యకవి

## సర్వముఖ సంఘసంస్కర్తలు

# కందుకూరి దంపతులు

ఇది కందుకూరివారి 140 వ జన్మదినోత్సవం. 16 - ఏప్రియల్ 1848 న జన్మించిన ఆ మహనీయుడు స్త్రీ జనోద్ధరణకు ఎలా తోడ్పడ్డాడు ? ఎన్ని ఇక్కట్లు అనుభవించాడు ? ఈనాటికైనా వారి కృషి ఫలించిందా ? ఆ సంస్కరణోద్యమానికి రాజ్యలక్ష్మిగారి పాత్ర ఏమిటి ? అనే విషయాలు ఈనాటి స్త్రీలు తెలుసుకోవటం ; ఆచరించటం అవస్య కర్తవ్యం అనక తప్పదు.

### మల్లాది సుబ్బమ్మ

" వండ నలయుదు వేవురు వచ్చిరేని
అన్నపూర్ణకు నుద్దియౌ నతని గృహిణి
అతిధులేతేర నడికి రేయైన అన్నట్లు "

రాజ్యలక్ష్మిగారు - కందుకూరి వీరేశలింగంగారి ధర్మపత్ని - భర్తకు చేదోడు వాదోడుగా యుండి యిరువురి జీవితాలకు ధన్యత గడించారు.

పురుషుడు పరిపూర్ణ మానవుడగుటకు తన భావాల్ని అర్థం చేసుకొనే శక్తి, సహృదయం గల భార్య లభించాలి ఆమెలో మానవత, హేతువాద దృక్పధం వుంటేనే మంచి చెడులను అర్థం చేసుకొని సంపూర్ణంగా సహకరిస్తుంది అనురాగం, ధైర్యం, ప్రతిభా సంపన్నతలు గల సాధ్వి కందుకూరికి భార్యగా లభించటంవల్ల సోక్రటీసు కూడా పొందలేని అదృష్టం వీరేశలింగంగారికి దక్కింది. విద్యా విజ్ఞానాలు లేని సామాన్య స్త్రీ రాజ్యలక్ష్మిగారు. మత మౌఢ్యంగల సంప్రదాయ కుటుంబంలో పుట్టి పెరిగిందామె భర్త సాహచర్యంలో అతని సహృదయతకు కార్య శూరతకు ఆకర్షితురాలైంది జీవిత భాగస్వామిగా తోడు నీడగా నిలచి భర్త చే శతాధిక గ్రంథాలు వ్రాయించుటకు తోడ్పడ్డది సహ కార్యకర్తగా స్త్రీ విద్యా, స్త్రీ పునర్వివాహాది సంస్కార కార్యక్రమాలకు సంపూర్ణ బాధ్యత వహించిన ధీర వనిత దుర్బల శరీరంతో, అంగబలం అర్థబలం, అధికార బలం లేని తెలుగు పండితుడైన భర్తను యాభై సంవత్సరాలు తల్లిలాగా పోషించింది. మంత్రిగా సలహాల నందించింది. భూదేవతగా బరువు బాధ్యతలు భరించింది భర్త శుశ్రూషలో విద్యనార్జించి "జనానా" పాఠశాలకు వయోజన స్త్రీ పాఠశాలకు ప్రథమ ఉపాధ్యాయినీత్వం నిర్వహించిన ఆదర్శ మహిళ.

ప్రార్థనామందిరానికి నిర్వాహకురాలైంది భర్త యావదాస్తిని పరహితార్థప్రయోజనాలకు వెచ్చించుచే గాక 40 వేల రూ. హితకారిణీ సమాజానికి ట్రస్టుడీడ్ వ్రాస్తుంటే నిండు హృదయంతో సంతోషించిన త్యాగశీలి వారెదుర్కొనే విపత్తులకు సామాన్య గృహిణైతే గుండె పగలాల్సిందే. ఆ విదుషీమణి ఆత్మ స్థైర్యం, త్యాగం, ఓర్పు, నేర్పు లేకున్నచో ఆ వ్యక్తి మహామనిషి కాగలడా! వారు మొదటి స్త్రీ పునర్వివాహం చేస్తుంటే ఇంటి తలుపుల పైన, పెరటి ముందు అశుద్ధం పోశారు కొందరు నానా దుర్భాషలాడారు మతాధిపతులు, పీఠాధిపతులు బహిష్కారతాఖీదులు పంపారు. పంతులుగారిని కొట్టడానికి చంపటానికి పొంచి వుండేవారట. సంఘ బహిష్కృతులైన వీరిని బంధువులు, స్నేహితులు, వంటవారు, చాకలి, మంగలి, పురోహితులెవ్వరూ దరిచేరని సమయంలో రాజ్యలక్ష్మిగారు స్వయంగా వండి వడ్డించి విధవా వివాహములు జరిపించిన అపూర్వ సాధ్వీమణి ఆమె ముక్కుపచ్చలారని ముద్దుగుమ్మలు, నొసట కుంకుమకై తమ నాశ్రయిస్తే వార్ని చేరదీసి నుదుట బొట్టు పెట్టి కట్నకానుకలతో వివాహాలు జరిపేవారు. పురుళ్ళు పోయటం, ఆర్థిక సహాయం కూడా వారి వంతే

అప్యేది వితంతువుల బంధువులు వీరిపై దండయాత్రలు చేస్తుంటే భర్తతోపాటు ధైర్యంగా నిలిచిందా ధీమంతు రాలు. వారికి తగవులొస్తే తీర్చేది. జబ్బులొస్తే చూచేది. తల్లి కరువైతే వారి పిల్లల్ని స్వయంగా పెంచేది. కొందరు కృతఘ్నులై వీరిని నానా దుర్భాష లాడినా తొట్రుపాటు చెందని కార్య శూరులా దంపతులు.

శ్రీ పునర్వివాహ వుద్యమ సందర్భంగా ఆయన పడ్డ పాట్లు వారి ఆత్మకథ చదివితే గాని తెలియదు. పిల్లతల్లి పెండ్లికని పిల్లని వొప్పచెప్పేది తండ్రి వచ్చి ఘర్షణ పడేవాడు. తన శిష్యుల సాయంతో, పోలీసుల రక్షణతో కొన్ని వివాహాలు జరిగినై. తలుపులు బిగించి జరిపినవి మరికొన్ని ఇలా 40 విధవా వివాహాలు జరుపగలిగిరి.

భర్త శరణుజొచ్చిన పతితలను దరికిజేర్చి రహస్యగా పురుళ్ళు పోసేది. వారికొరకు శ్రీ జనోద్ధరణ శరణాలయం కట్టించి, వారి నాదరించి నీతిపై వారికి ఉపన్యాసాలిచ్చే వారు. సంస్కారులైనవారు కొందరు వివాహాలు చేసు కొని వెళ్ళేవారు. ఇలా సమాజంపై ప్రేమామృతం జల్లి బదులుగా ద్వేష, విష వాయువులు స్వీకరించిన ఆదర్శ దంపతులు. భార్యను అమితంగా ప్రేమించిన పంతులుగారు తన సంఘసేవకు ఆమె దోహదం అపూర్వ మని ఆత్మకథలో వ్రాశారు. ఆమె సహాయాన్ని లోక హితం కొరకే స్వీకరించారు. బిడ్డలు లేని వారికి లోకమే కుటుంబమైంది. జీవితంలో ఏనాడు చలించని వీరుడు ఆమె వియోగంతో తీరని అసహాయతను అనుభవించారు. ఆమె సమాధి ప్రక్కనే తన సమాధికి చోటుంచి ఆ తోటకు " రాజ్యలక్ష్మి ప్రమదావన " మని పేరిడి తన కృతజ్ఞతను తెల్పుకున్నారు

సనాతన సంప్రదాయి కుటుంబంలో జన్మించిన వీరేశలింగంగారు సర్వతోముఖ ప్రజ్ఞాశాలి రచయిత, సంఘసంస్కర్త, నిరంతర సత్యాన్వేషికుడు, నవవైతాళిడైన వీరేశలింగంగారి జీవితధ్యేయాలు సంఘసంస్కారం, సాహితీ పిపాస, వ్యక్తివికాసం. అధునాధునిక భావాలతో నూతన యుగాన్ని సృష్టించిన యుగకర్త అభ్యుదయ భావాలకు ఆటపట్టు. నిర్భయ కార్యాచరణుడు. నమ్మిన

## ప్రశ్నలు - సమాధానాలు

1. 'హాలెండ్' దేశం యొక్క క్రొత్తపేరు ఏమిటి ?
2. మానవ శరీరంలో గుండె ఒక్కసారి కొట్టుకో డానికి అవసరమయ్యే కాలం ఎంత ?
3. బెల్ మెటల్ ఏ లోహాల మిశ్రమము ?
4. భారత రాష్ట్రపతి పదవి ఖాళీ అయిన ఎంత కాలం లోగా భర్తీ అవ్వాలి ?
5. ' యునైటెడ్ నేషన్స్ ' అనే పేరు అమెరికాకు ఎవరు పెట్టారు ?
6. ' ది ఏషియన్ డెవలప్‌మెంట్ బ్యాంక్ ' కేంద్ర స్థానం ఎక్కడుంది ?
7. హర్యానా రాష్ట్రం ఎప్పుడు ఏర్పడింది ?
8. అలగ్జాండర్ ఎక్కడ చనిపోయాడు ?
9. ధ్వని వేగము గాలిలో కంటే నీటిలో ఎన్ని రెట్లు ఎక్కువ ?
10. రావి నది ఒడ్డున ఉన్న ప్రముఖ నగరమేది ?
11. ' లాంప్ ఆఫ్ మిడ్‌నైట్ సన్ ' అనే పేరు గల దేశమేది ?
12. 'ఈవెనింగ్ స్టార్' గా పేర్గాంచిన గ్రహమేది ?
13. ' ప్రపంచ అటవీ సంపద దినం ' ఏది ?
14. ఇండియన్ స్టాండర్డ్ టైము, లోకల్ టైము ఎల్లప్పుడూ ఒకే విధంగా ఉండే నగరాలలో ఒకదాని పేరు ?

1 ది నెదర్‌లాండ్స్ 2. 0 8 సెకండ్ 3. కాపర్ మరియూటిన్ 4 6 నెలలు 5 ఫ్రాంక్లిన్ రూజ్వెల్ట్ 6. మనీలా 7 డిసెంబర్ 22, 1949 8 బాబిలోనియాలో 9 5 రెట్లు 10 లాహోర్ 11 నార్వే 12 వీనస్ 13. 21 మార్చ్ 14. అలహాబాద్

సిద్ధాంతం ప్రచారం చేయుటయే కాక కార్యరూపంలో సాధించే దిట్ట. నిర్మించిన సంస్థలు, సాధించిన విజయాలు అనన్య సామాన్యాలు. సంస్థలుండి, సభ్యులుండి ప్రభుత్వ గ్రాంట్లతో కూడా సాధించలేరు కొందరు. 20 రూపాయల జీతంతో ఒంటరిగా అనేక విషమ సమస్యలను ఎదుర్కొనే వారు. నిందలకు కృంగుట పొగడ్తలకు పొంగుట యెరుగని సత్య బోధకుడు ధనం కొరకు యాచించుట గాని ధనాభావంవల్ల తలపెట్టిన పనులలో వెనుకంజ గాని యెరుగని పురోగామి. తన గ్రంథములపై వచ్చు ఆదాయమంతా ప్రజా శ్రేయస్సుకై వెచ్చించిన మహావదాన్యుడు.

ఈ సాంఘిక విప్లవకారునికి అనాడు తను తలపెట్టిన సంస్కరణలు బహు కష్టమనీ, అనేక అవాంతరాలొస్తాయని, తన పోరాటం మత మౌఢ్యంతో నని తెలుసు ఆదర్శాలకై నిర్భీతితో నిలచి పోరాడటమే గాని వెనకడుగనేది జీవిత చరిత్రలో లేనే లేదు. విరామ మెరుగని కర్మవీరుడు. బాలబాలికలకు హైస్కూలు కట్టించి స్త్రీ విద్యకు తోడ్పడిన విద్యాపోషకుడు. మెట్రిక్యులేషన్ చదువుతో 150 రచనలు చేసిన సాహితీ పిపాసి. 20 దాకా శతకాలు వ్రాశారు. ఇంగ్లీషు సంస్కృతాలనుండి నాటకాలను అనువాదాలు చేశారు. తర్కశాస్త్రం, శరీరశాస్త్రం, ఖగోళశాస్త్రాలు అనువదించారు. వారి ప్రహసనాలు, నవలలు వ్యాసములు కోకొల్లలు 19 వ శతాబ్దంలో ఆంధ్ర వాఙ్మయం అంధకారంలోనున్నప్పుడు సమస్త సాహిత్య ప్రక్రియలకు నాంది పల్కిన కళాభిజ్ఞుడు, అనాడే అష్టావధానాలు చేసి చూపిన అద్వితీయుడు

పురమందిరం ప్రార్థనామందిరం, వితంతు శరణాలయం, పతితస్త్రీ శరణాలయం యివి అన్నీ వారి కృషి ఫలితాలే.

బీదలకు రాత్రులు సారశాలలు నడిపేవారు. వివేక వర్ధని పత్రిక స్థాపించి మూఢాచారం, అవినీతి, అక్రమం, అన్యాయం, లంచగొండితనాలపై విమర్శలు సాంఘిక దురన్యాయాలపై వ్యాసాలు వ్రాసేవారు. ప్రత్యర్థులు "ఆంధ్ర భాషా సంజీవని" "హస్యవర్ధని" లో వార్ని అవహేళన చేస్తూ వ్రాసేవారు.

స్త్రీ విద్య నిషేధపు రోజుల్లో స్త్రీల వ్యాసరచనా పోటీలు పరీక్షలు నిర్వహించేవారు. ఈనాడు లంచం పుచ్చుకోని వాడు అసమర్థుడన్నట్లు నాడు వేశ్య నుంచుకోని వాడు అరసికుడనేవారు. వేడుకలలో భోగం మేళం పెట్టించి కానుకలిచ్చేవారు. ఈ పద్ధతిని మిత్రులచే కట్టడి చేయించి పంతులుగారు మాన్పించారు. లంచగొండి ఆఫీసర్ని 191) మే లో పట్టి శిక్షించుటకై కేసు పెట్టాడు. లంచగొండి ఆఫీసర్ని పట్టి శిక్షించుటకై కేసు పెట్టి సాక్ష్యాధారాలతో రుజువు చేశారు. వ్యభిచార వృత్తి కులవృత్తిగా స్వీకరించుట ఘోరమని నిరసిస్తూ తిరుగుబాటు చేశారు. జాతకాలు, దయ్యాలు, మంత్రాలు మూఢాచారాలపై హాస్య ధోరణిగా కథలూ, వ్యాసాలు వ్రాస్తూ నిందించే వారు దయ్యాన్ని చూపమని భూతవైద్యుని, మాంత్రికుని సవాల్ చేస్తూ స్మశానంలో కూర్చుని వారికి సింహస్వప్నమైనారు. కన్యాశుల్కం అనాగరికమని బిడ్డల్ని వేలంలో హెచ్చు పాట పాడి అమ్ముట ఘోర నేరమని గగ్గోలు పెట్టేవారు. అతి బాల్య వివాహాలవల్లే బాల నితంతువుల సంఖ్య పెరిగిందని, బాల్య వివాహాలు నిరసించారు. వారి బ్రతుకులో వసంతం రావాలని, అతి నీచంగా, క్షుద్రంగా వారిని చూడరాదని వార్ని బంధికానాలో వుంచి బండ చాకిరి చేయించరాదని ఛాందసులపై తిరుగుబాటు సల్పారు. కార్యశూరుడే గాని వాగాడంబర మెరుగని నీతిపరుడు. శారీరకంగా అస్వస్థుడైనా మానసికంగా ఆశావాది. తన భావ సముదాయాన్ని గద్య పద్య రూపాల్లో ఉపన్యాసాల్లో వెదజల్లిన నిర్భీతిపరులు. చివరవరకు స్త్రీ పునర్వివాహ సమరంలో మహా యోధుడై పోరాడి నిలిచారు. ఇది శాస్త్ర సమ్మతమేనని శ్రుతి స్మృతులతో చూపినప్పుడు పండితులు తిట్టి కొట్టబోయిరి కూడా.

1919 మే 27 వ తేదీన వారు మరణించినా ముఖ్యంగా స్త్రీజాతి హృదయాలలో అచంద్రార్కం జీవించేవుంటారు. మానవాళిలో ఉన్నతులు, ఉత్తమోత్తములు. ఈ అంతర్జాతీయ మహిళా సంవత్సరంలో వేలాదిగా వీరేశలింగాలుద్భవించి స్త్రీలకు పురుషులతో సమాన స్వేచ్ఛా స్వాతంత్ర్య ప్రతిపత్తులు విప్పుటకు సహకరించాలి. ★

మినీ కథ

# ఈ కాలపు ముగింపు

– కృష్ణ చైతన్య

"సూర్యం! ఒరేయ్ సూర్యం ఇలారా. భడవా, అల్లరి చేయకుండా కూర్చొని బుద్ధిగా చదువుకోరా" అని అరుస్తున్న బామ్మ మాటలు విని వాకిట్లో ఆడుకుంటున్న సూర్యం ఇంట్లోకి వచ్చాడు.

"ఎప్పుడూ చదువేంటే బామ్మా" అన్నాడు కొద్దిగా విసుగ్గా.

"చదువుకునే టైములోకూడా ఆడుకుంటే ఎలారా అబ్బాయి? ఇలా అయితే నువ్వు కలకటేరు ఎప్పుడు అవుతావురా?" అంటూ దీర్ఘం తీసింది బామ్మ.

సూర్యం ఏదో అనబోయేంతలో చావిట్లో పడక్కుర్చీలో కూర్చున్న తాతయ్య "సూర్యం ఇలారా! కథ చెప్తాను" అని పిల్చాడు. కథ అవగానే ఉషారుగా తాతయ్య దగ్గరకు పరిగెత్తాడు సూర్యం.

"నువ్వు కలక్టరు చదవాలంటే నీకు తెలివితేటలు ఉండాలి కదా, అందుకని నిన్ను ఒక కథలాంటి ప్రశ్న అడుగుతాను జవాబు చెప్పు" అన్నాడు తాతయ్య ప్రశ్న అనగానే చిరాకు పడ్డాడు సూర్యం. వాడిది తెలివైన బుఱ్ఱే కానీ ఆలోచించాలంటే బద్ధకం. కానీ విసుగును బయటకు ప్రదర్శించకుండా "సర్లే చెప్పు" అన్నాడు. తాతయ్య చెప్పటం మొదలు పెట్టాడు

"అనగనగా ఒక ఊళ్ళో రామయ్య అనేవాడు ఉన్నాడు. వాడి దగ్గర ఒక పులి, ఒక మేక ఉన్నాయి. ఒక రోజున వాడు పులినీ, మేకనీ, తీసుకొని అడవికి వెళ్ళి మేకకి గడ్డి తీసుకొని తిరిగి వస్తున్నాడు. దారిలో ఒక నది ఉన్నది. నది దాటడానికి బల్లకట్టు ఉంది. ఆ బల్లకట్టు నడిపేవాడిని "దాటడానికి ఎంతవుతుంది?" అనడిగాడు. అందుకు వాడు "దాటడానికి ఒకళ్ళకూ రూపాయి అవుతుంది. నేను కాక ఇద్దరే ఎక్కాలి. ఖాళీగా బల్లకట్టు ఇవతల్నుంచి అవతలకు తిరగాలంటే రూపాయి అవుతుంది" అన్నాడు.

రామయ్యకు నది ఎలా దాటాలో అర్థంకాలా. తనూ పులీ వెళ్తే మేక గడ్డి తింటుంది. తను గడ్డివాముతో వెళ్తే పులి మేకను తింటుంది. ఆలోచించగా రామయ్య బుఱ్ఱకు ఒక ఆలోచన తట్టింది. దానిని అమలు పరచి నదిని దాటాడు" అని ఆపాడు తాతయ్య 'ఎలా?' అని అడిగాడు సూర్యం. "ఎలాగో నువ్వే చెప్పురా వెధవా! ఎంత ఖర్చయిందో కూడా చెప్పాలి" అన్నాడు తాతయ్య. ఆలోచనలో పడ్డాడు సూర్యం వాడి బుఱ్ఱకు అందలేదు. విసుగు పుట్టి "నువ్వే చెప్పు" అన్నాడు.

"ఈ మాత్రానికే చెప్పకపోతే ఎలారా అబ్బాయ్? నన్ను మా దొరగారు అడిగితే చెప్పబట్టే కదా నాకు గుమాస్తా ఉద్యోగం వచ్చింది మరి ఇది చెప్పకపోతే నువ్వు కలక్టరు ఎట్లా అవుతావురా?" అని గర్వంగా మీసం మెలిపెట్టాడు. "నాకు రాదు నువ్వే చెప్పు" అని ఉక్రోషంగా అన్నాడు సూర్యం "సరే చెప్తా విను. ముందు రామయ్య, మేక వెళ్తారు. ఖర్చు రెండు రూపా

యలు. మేకను అవతల వదలి బల్ల కట్టుతో తిరిగి వస్తాడు. ఖర్చు రూపాయి పులితో మళ్లా వెళ్తాడు. ఖర్చు రెండ్రూపాయలు. పులిని అక్కడ వదలి మేకను తీసుకు వస్తాడు. ఖర్చు రెండు రూపాయలు మేకను దింపి గడ్డిమోపును తీసుకు వెళ్తాడు, ఖర్చు రెండు రూపాయలు. తిరిగి తనొక్కడే ఇవతలకు వస్తాడు ఖర్చు రూపాయి తిరిగి మేకతో అటుపైపు వెళ్లిపోతాడు. ఖర్చు రెండు రూపాయలు. మొత్తం ఖర్చు పన్నెండు రూపాయలు అర్థమైందా ? " అని సగర్వంగా నవ్వాడు తాతయ్య.

దాన్ని అర్థం చేసుకోవడానికి కొంతసేపు పట్టింది వాడికి. కానీ కొంతసేపట్లో వాడి బుఱ్ఱలో ఒక ఐడియా వచ్చింది. " తాతయ్యా ఖర్చు పన్నెండు రూపాయలు కాదు. ఏడు రూపాయలే " అన్నాడు. ఈసారి ఆశ్చర్యపోవడం తాతయ్య వంతు అయింది. " ఎలా " అని అడిగిన తాతయ్య ప్రశ్నకు గర్వంగా కాలరు ఎగరేసి చెప్పడం మొదలెట్టాడు. " మొదట గడ్డివామును పంపిస్తాడు తను ఇవతల ఉండే. ఖర్చు రూపాయి. ఖాళీగా రమ్మంటే బల్లకట్టు రాదుగనక రూపాయి ఇస్తే ఇవతలకు వస్తుంది. తరువాత పులి, రామయ్యా వెళ్తారు. ఖర్చు రెండు రూపాయలు. తిరిగి పులిని దింపి ఇవతలకు వస్తాడు ఖర్చు రూపాయి, మేకతో అవతలి ఒడ్డుకు వెళ్లిపోతాడు ఖర్చు రెండు రూపాయలు. మొత్తం ఖర్చు ఏడు రూపాయలే " అన్నాడు వాడు. తాతయ్య తెల్లబోయాడు. " మా నాన్నే, మా బాబే, నీకు కలకటేరు ఉద్యోగం ఖాయంరా నాన్నా " అని మెటికలు విరిచింది బామ్మ. ★

## విజ్ఞానవా

మానవుల ఆరోగ్యాభివృద్ధికి తేనె అమృత తుల్యమైనది.

తేనెలో కాల్షియం, ఇనుము (Iron), విటమిన్ బి, విటమిన్ సి విస్తారంగా ఉన్నట్లు పరిశోధనల వల్ల తెలిసింది.

ఒకరోజులో తేనెటీగ తన బరువుకు పది రెట్లు తేనె సమకూరుస్తుంది.

ఒక లీటరు తేనెలో 16 లీటర్ల పాలలో గల శక్తి లేక 48 గ్రుడ్లు యిచ్చే శక్తి యిమిడి వుంటుంది.

ఇప్పపువ్వులనుండి గ్రహింపబడే తేనె హృద్రోగానికి చాలా మంచిది.

స్త్రీకి మొట్టమొదట శస్త్రచికిత్సచేసిన వైద్యుడు "ఎఫ్రాయీమ్ మెక్‌డోవెల్" (1809 సంగతో).

మామిడితొక్కలో కొన్ని విషరసాయనాలుంటాయి. ఎక్కువగా మామిడిపండ్లు తినినచో సెగ్గడలు లేవటానికి, అరగకపోవటానికి, సోమరితనం ఏర్పడటానికీ ఈ విషరసాయన పదార్థమే కారణం.

బాగా ముగ్గిన మామిడికాయ గుండెకు శక్తినిస్తుంది.

రోజుకు మనకు విటమిన్ ఎ 5000 యూనిట్లు కావలసివుంటుంది. దాదాపు 100 గ్రాముల బరువు గల మామిడి పండు తినటంద్వారా రోజుకు కావలసిన విటమిన్ ఎ పొందవచ్చు

ఎ విటమిన్ దేహంలో నిల్వచేసుకోవచ్చును. కావున మామిడిపండ్ల కాలంలో కావలసినన్ని పండ్లు తినవచ్చును. మన దేశంలో దాదాపు 500 రకాల మామిడిపండ్లు పండిస్తున్నారు.

బంగాళాదుంపలను ఆహారపదార్థంగా మొట్టమొదట ఆరగించినవారు ఐర్లండ్ దేశస్థులు.

— యస్. యన్.

# పొడుగు మెడ కొంగలు

పచ్చని వరి పొలాల మధ్య తెల్లగా గుంపులు గుంపులుగా కదలక మెదలక నిలబడి జపం చేస్తున్నవా అనిపించే పక్షులే కొంగలు ఈ దృశ్యం దక్షిణ అమెరికా, మెడగాస్కర్, న్యూజీలాండ్ వంటి ప్రాంతాల్లో తప్పించి ప్రపంచమంతట కనిపిస్తుంది. కొంగ అనగానే మనకు గుర్తు వచ్చే మరో మాట కొంగ జపం. కొంగలు ఒంటి కాలుమీద నిలబడి మౌనంగా నిలుచుంటాయి. కాని అవి ఏ కారణం వల్ల అలా చేస్తాయో ఇంతవరకు అర్థం కాలేదు.

కొంగలు 70 నుంచి 150 సెం. మీ ఎత్తు ఉంటాయి. పొడవుగా వుండే కాళ్లు, మెడవల్ల దీనికి ఇంత ఎత్తు కలిగింది. కొంగలు అధిక ఉష్ణోగ్రతను భరించలేవు. అందువల్ల నే ఎప్పుడు నీటిని అంటిపెట్టుకుని వుంటాయి. ఉదయం, సాయంత్రం సమయాల్లో వరి పొలాలను దర్శించి, ఆహారం స్వీకరించుకుని మధ్యాహ్నం సమయానికి పెద్ద చెరువులు, కుంటల దగ్గరికి చేరుతాయి. కొంగలు సాధారణంగా చెట్లమీద వాలవు. రాత్రిపూట ఒక కన్ను తెరచి వుంచి నిద్ర పోతాయి.

కొంగలు చిన్న చిన్న గుంపులుగా నివశిస్తాయి. గుంపులో పక్షుల సంఖ్య 80 కి మించవు ఒక పక్షి నాయకత్వంలో ఈ గుంపు అంతా సుదూర ప్రాంతాలకు వలస వెడుతుంటాయి. ఆకాశంలో > ఆకారంలో ఎగిరే కొంగల గుంపు చూడ ముచ్చటగా వుంటుంది. కొంగల అరపు బాకా వూదినట్టు లేదా విజిల్ వేసినట్టుగా వుంటుంది.

కొంగలు చేసే నృత్యం మరో ప్రత్యేకత. సంవత్సరంలో ఏ సమయంలో నైనా కొంగలు నృత్యం చేయవచ్చు. కాని జంట కట్టే సమయంలో చేసే నృత్యం అందంగా వుంటుంది. పెద్ద పెద్ద అంగలు వేస్తూ, రెక్కలు విదిలిస్తూ గుండ్రంగా పరిగెడుతాయి. మధ్య




మధ్యలో కొద్ది ఎత్తుకు ఎగిరి కిందికి దిగుతుంటాయి. గడ్డి పోచలను, ఎండు పుల్లలను పైకి ఎగురవేసి తిరిగి పట్టుకోవటం నృత్యంలో భాగమే.

కొంగలు జీవితంలో ఒకేసారి జోడు కడతాయి. గూడు కట్టేందుకు మనుష్య సంచారం లేని ప్రాంతాన్ని ఎంపిక చేసుకుంటాయి. నీటి కుంటల మధ్యలో, తేమగా వుండే చోట నేలలో గుంట చేసి, లేదా రకరకాల పుల్లలను ఒక చోట చేర్చికాని గూడు కడతాయి. సాధారణంగా రెండు గుడ్లకన్నా ఎక్కువ పెట్టవు పొదగడం, పిల్లల్ని పోషించడంలో ఆడ, మొగ రెండు సమాన పాత్ర వహిస్తాయి.

కొంగలు కూడా నేడు అంతరించిపోతున్నాయి. ఏభైకి పైగా వుండాల్సిన కొంగ జాతుల్లో నేడు పదునాలుగు జాతులు మాత్రమే మిగిలున్నాయి.

— డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు

# చెరసాలలో చరిత్ర ప్రసిద్ధి చెందిన రచయితలు

చెరసాల లేదా జైలు వ్యక్తి స్వేచ్ఛకు భంగ కరమైనా అక్కడ దొరికే ఏకాంతము, తీరిక ఎక్కడా దొరకదు అందువల్లనేమో గొప్ప, గొప్ప నాయకు లందరూ జైళ్ళలో దొరికే ఏకాంతాన్నీ, సమయాన్నీ సద్వినియోగం చేసుకొని అనేక ఉద్గ్రంధాలు రచించారు - "భారత దర్శనము" అను పేరుతో నేను ఏర్పాటు చేస్తున్న సదస్సుకు ఏమైనా కాస్త వ్రాసి పంపండి అని "హార్వే బ్రైట్" వ్రాసిన ఉత్తరానికి స్వర్గీయ శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ "నన్ను జైలుకెళ్ళమంటారా" అని ప్రత్యుత్తర మిచ్చారు. "నాకు మీ మాట అర్థం బోధ పడలేద"ని ఆ అమెరికన్ జర్నలిస్ట్ అంటే "జైల్లో ఉన్నప్పుడే ఏమి వ్రాయడానికైనా నాకు తీరిక ఉంటుంది" అని నెహ్రూ జవాబిచ్చారు.

**బి. వి. రామకృష్ణ**

ఒక నెహ్రూయే కాదు. ఎందరో మహనుభావులు జైళ్ళలో ఉండే చరిత్రప్రసిద్ధి చెందిన గ్రంధాలను రచించారు ఫ్రెంచి రచయితయిన "ఓ హెన్రీ" చెరసాలలో ఉన్నప్పుడు 500 పేజీలు కల "పాపిలన్" అన్న గ్రంథాన్ని రచించాడు. ఆ గ్రంథం ప్రపంచ భాషలన్నిటిలోకి అనువదించబడి జగద్విఖ్యాతి చెందింది. ప్రఖ్యాత బ్రిటిష్ తత్వవేత్త బెర్ట్రాండ్ రస్సెల్, ఒకప్పుడు బ్రిక్స్టన్ జైల్లో రిజిష్టర్‌లో ఖైదీ నెంబరు 2917 గా వ్యవహరించబడేవాడు ఆయన శాంతి వాదని ట్రినిటీ కళాశాలలోని ఫెలోషిప్‌ను పోగొట్టి బ్రిక్స్టన్ జైలుకు పంపింది అదే విధంగా జాన్ బన్‌యన్ "పిల్‌గ్రిమ్స్ ప్రోగ్రెస్" ను 1675 లో జైలులో వుండే వ్రాశేడు. "కామన్‌సెన్స్" అనే విఖ్యాత గ్రంథం రచించి అమెరికన్లను స్వాతంత్ర్య సమరోన్ముఖులను గావించిన థామస్‌పేన్ ఫ్రెంచి జైలులో వుంటూ "ది ఏజ్ ఆఫ్ రీజన్" అనే ప్రసిద్ధ గ్రంథం రచించాడు.

బ్రిటన్‌లో "ప్రిజనర్స్ డెన్" అన్న జైలులో బాధామయ జీవితాన్ని గడుపుతున్నప్పుడే జార్జి. డబ్లు యు. ఎం రైనాల్డ్స్ "మిస్టరీస్ ఆఫ్ ది కోర్ట్ ఆఫ్ లండన్" అన్న పేరుతో 27 వాల్యూముల సుదీర్ఘ రచనను గావించి సంచలనం సృష్టించాడు. రిచర్డు లవ్‌లెస్ ఖైదు జీవితం అనుభవిస్తున్నప్పుడు "టు ఆల్తియా ఫ్రమ్ ప్రిజన్" అనే ప్రపంచ ప్రసిద్ధమైన పద్యం వ్రాశాడు. ఒకప్పుడు "క్వీన్ ఎలిజబెత్" కి ప్రీతి పాత్రుడైన "రాలీ" లండన్ గోపురంలో బంధించ బడినప్పుడు "హిస్టరీ ఆఫ్ ది వరల్డ్" వ్రాశాడు ఆస్కార్ వైల్ జైలులో వున్నప్పుడే "డెప్రొఫండిస్" గ్రంథం రచించాడు

ప్రపంచాన్ని గడగడ లాడించిన నాజీ నియంత "అడాల్ఫ హిట్లర్" లాండ్స్‌బర్గ్‌లో వున్నప్పుడు, "మైన్ కాంఫ్" అన్న గ్రంథం రాసినప్పుడు ప్రతీ మాటకు 125 మంది, ప్రతీ పేజీకి 4700 మంది, ప్రతీ అధ్యాయానికి 12,00,000 మంది ప్రాణాలను కోల్పోయారట.

ఇక మన నాయకుల విషయానికొస్తే లోకమాన్య బాల గంగాధర తిలక్ మాండలే జైలులో ఉన్నప్పుడు "గీతా రహస్యం" అన్న గ్రంధాన్ని రచించాడు రాజాజి (చక్రవర్తి రాజగోపాలాచారి) జైలు డైరీ, ఆజాద్ ఖురాన్‌పై వ్యాఖ్యలు రచించారు. ఇక జాతిపిత మహాత్మా గాంధీ సంగతి చెప్పనక్కరలేదు ఆయన జైలులో ఉన్నప్పుడు రాసిన గ్రంథాలలో "మై ఎక్స్పెరిమెంట్స్ విత్ ట్రూత్" ఒకటి. లోక్ నాయక్ జై ప్రకాశ్ నారాయణ్ జైలులో నిర్బంధించినప్పుడు "ప్రిజన్ డైరీ" అను గ్రంథాన్ని రచించాడు. డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్య జైలులో ఉన్నప్పుడే "కాంగ్రెస్ చరిత్ర" రచించారు.

ప్రసిద్ధ రచయిత "సెర్వాంటిస్" సెవెల్లి జైలులో వుండగా డాన్‌క్విక్సోట్ అన్న ప్రపంచ ప్రసిద్ధి చెందిన గ్రంథాన్ని రచించాడు. విఖ్యాత రోమన్ తత్వవేత్త బోధియస్ "కన్సొలేషన్స్ ఆఫ్ ఫిలాసఫీ" అను గ్రంథాన్ని రచించింది కారాగారవాసంలో ఉన్నప్పుడే.

తాను జైలులో వున్నప్పుడు ఏమీ తోచనప్పుడు రాత్రి పూట జైలు ఊచల మీదనుంచీ ప్రసరించే వెన్నెల వెలుగులను, ఆకాశంలో తళతళలాడె ట్వింకిలింగ్ స్టార్స్ చూస్తూ కాలం గడిపేవాణ్ణని పేర్కొన్నాడు బహుశా ఆ అనుభూతే ఆయనకు గ్రంథ రచనలో ఉత్తేజాన్ని కలిగించేదేమో.

ఏమైనప్పటికి, జాతీయ నాయకులకు, మాన్యులకు, సామాన్యులకు, తత్వవేత్తలకు జైలు జీవితం అణిముత్యాలనదగిన గ్రంథాలను వ్రాసే అవకాశం ఇచ్చినదన్నమాట జగమెరిగిన నిజం.

* *

# హాస్యం

## నవ్వితే నవ్వండి

ఇటీవలి కాలంలో ఇంటర్వ్యూలలో సైకాలజీకి సంబంధించిన ప్రశ్నలు ప్రముఖంగా వుంటున్నాయి

ఒకసారి ఇంటర్వ్యూ జరుగుతున్నది ఒక సభ్యుడు అభ్యర్థుల నందరినీ ఈ క్రింది ప్రశ్న వేస్తున్నాడు.

నువ్వు కారులో డ్రైవ్ చేసుకుంటూ వెళుతున్నావు. ఇంతలో పెద్ద తుఫాను ఆరంభమైంది. మధ్యలో ఒక చోట వర్షంలో తడిసిపోతూ ఒక వయసు మళ్లిన ముసలావిడ, ఒక అందమైన అమ్మాయి, ఇదివరలో నీ ప్రాణం కాపాడిన డాక్టర్ కనిపించారు నీ కారులో ఒకే వ్యక్తికి చోటుంది మరి ఆ ముగ్గురిలో ఎవరిని ఎక్కించుకుంటావ్!

ఈ ప్రశ్నకు ఒక్కొక్క అభ్యర్థి ఒక్కో విధంగా సమాధానం ఇచ్చారు. కాని ఒక తెలివిగల కుర్రాడి సమాధానం . .

"కారు తాళం చేతులు డాక్టర్‌కి ఇచ్చి, ఆ ముసలమ్మను ఎక్కించుకు వెళ్ళమని చెపుతా నేనేమో ఆ అమ్మాయిని తీసుకుని దగ్గరలో వున్న లాడ్జికి చేరతా".

## ప్రముఖుల హాస్యం

మునిమాణిక్యం నరసింహారావుగారు, మొక్కపాటి నరసింహశాస్త్రిగారు తెలుగులో పేరొందిన హాస్యరచయితలుగా అందరికి తెలుసు వారిరువురూ ఒకసారి బందరులో ఒక హోటల్లో కూర్చుని తీరికగా కాఫీ తాగుతున్నారు.

వీరి పక్క బల్లమీద ఒక కుర్ర గుంపు కూర్చుని నాటి తెలుగు రచనల మీద తమ అభిప్రాయాలను బూతు మాటలు వాడుతూ వెలిబుచ్చుతున్నారు.

కోపగించుకున్న మునిమాణిక్యంగారు ఛివాల్న లేచి "అడ్డమైన వెధవలనందరిని హోటల్‌కి రానివ్వద్దని మేనేజర్‌కి చెప్పొస్తా" అని బయలు దేరారట

"తొందరపడి అలా చెప్పకండి వాడు అలా రానిస్తున్నాడు కాబట్టే మనం ఇలా వచ్చి కాఫీ తాగుతున్నాం" అన్నారు మొక్కపాటివారు తాపీగా నవ్వుతూ.

## పేరులో పెన్నిధి

పేరులో ఏమున్నది పెన్నిధి అనేది సామెత. కాని పుట్టిన సంతానానికి ఒక మంచి పేరుకోసం వెతుక్కునే తల్లితండ్రుల పాట్లు చూస్తుంటే నిజంగానే పేరులో ఏదో ఒక పెన్నిధి ఉన్నదేమో అనిపిస్తుంది లేకపోతే ఈ కింది పేర్లు చూడండి. ఇవి ఏ పెన్నిధికోసం పెట్టుంటారో (ఇవన్నీ ఇటీవల మండల ఎన్నికలప్పుడు పత్రికలో కనిపించినవి)

* సమాధానం
* అబద్ధయ్య
* శిఖ ముత్తేశ్వరరావు
* కోమటయ్య
* తాతయ్య (అతనికి ఇంకా పెళ్ళి కాలేదు)

— వాసు

# విదుర వృత్తాంతం

పురాణపండ శ్రీనివాస్

పూర్వకాలంలో సత్య ధర్మ నిష్ఠుడైన మాండవ్యుడనే బ్రాహ్మణ తపస్వి ఉండేవాడు ఆయన తన ఆశ్రమ సమీపంలో ఒక చెట్టు నీడను శీర్షాసనంలో మౌనవ్రతియై తీవ్రంగా తపస్సు సాగిస్తున్నాడు. ఆ తపో దీక్షలో సంవత్సరాలు గడిచిపోయాయి. ఆ రోజులలో ఒకనాడు కొందరు దొంగలు ఆ ప్రాంతానికి పరుగెత్తుకు వచ్చారు. వారిని రాజభటులు వెన్నాడుతున్నారు. చోరులు భయపడి వారి దగ్గర వున్న వస్తువులను ఆ ముని ఆశ్రమములో దాచి పారిపోయారు. రాజభటులు మహర్షిని సమీపించి చోరులు పోయిన జాడ చెప్పమన్నారు ముని మాట్లాడలేదు. భటులు ఆశ్రమాన్ని పరిసరాలనూ వెదకి దొంగలనూ, సొత్తునూ పట్టుకొని మునిని కూడా శంకించి బంధించి తీసికొనివెళ్లి మహారాజు ఎదుట నిలిపారు. వారందరికీ మరణ దండన విధించాడు చక్రవర్తి. రాజాజ్ఞానుసారం భటులు ఆ మునిని కూడా శూలానికి గ్రుచ్చారు. ధర్మాత్ముడైన మాండవ్యుడు అన్నపానాలు లేకుండా శూలాగ్రభాగంమీద చిరకాలం ఉండిపోయాడు. అలానే ఉండి తన తపశ్శక్తితో ఇతర ఋషులను పిలువసాగాడు వారు రాత్రివేళ పక్షి రూపాలలో వచ్చి - ఓ మాండవ్య మునీ ! ఏ కారణంచేత నీకీ కష్టస్థితి కలిగింది అని ప్రశ్నించారు మాండవ్యుడు తన ప్రారబ్ధానికి ఎవరి మీదనో దోషారోపణం చెయ్యటానికి అంగీకరించలేదు.

కాలం గడుస్తోంది రాజభటులు మాండవ్యుడు శూలారోపితుడైనా మరణించకపోవట చూసి ఆశ్చర్యంతో మహారాజుకి నివేదించారు. చకితుడై మహారాజు మాండవ్యుని వద్దకు వచ్చి - మునిప్రవరా ! నా అజ్ఞానాన్ని మన్నించి నన్ను అనుగ్రహించండి అని ప్రార్థించాడు మాండవ్యుడు ప్రసన్నుడయాడు అనంతరం రాజాజ్ఞానుసారం భటులు శూలాన్ని పైటికి తీయబోయారు వారి ప్రయత్నం ఫలించలేదు శూలాగ్రభాగాన్ని శరీరంలోనే ఉంచుకొని మాండవ్యుడు మిగిలిన భాగాన్ని ఛేదించాడు. శరీరంలో శూలమున్నా, ఆ మహర్షి ఏ బాధా లేకుండా చరిస్తూ పుణ్యలోకాలు సాధించాడు శూలాగ్రభాగాన్ని 'అణి' అని పిలుస్తారు అణితో చరించిన కారణంగా ఆ మహర్షి అణీ మాండవ్యుడయ్యాడు.

ఆత్మతత్త్వజ్ఞాని అయిన అణీమాండవ్యుడు ఒకనాడు యమలోకానికి వెళ్ళి దివ్యాసనం మీద ఆసీనుడై ఉన్న యమధర్మరాజుని సమీపించి ఓ మహాత్మా ! అజ్ఞానంలో నేను ఏ పాపం చేసినందువల్ల శూలారోపణం చేశారో వివరింపుమని కోరాడు అప్పుడు యముడు ఓ మహర్షీ ! చిన్నతనంలో నువ్వు తూనీగల తోకలకు ముళ్లు గ్రుచ్చి క్రీడించిన ఫలంగా ఈ స్థితి ప్రాప్తించింది. అల్ప దానమయినా మహా ఫలాన్నివ్వగల్గినట్లు స్వల్ప పాపం అత్యంత కష్టదాయకం కాగలదు - అన్నాడు.

తాను ఏ వయస్సులో ఆ పాపం చేశాడో చెప్పమనగా బాల్యావస్థలో అది జరిగిందన్నాడు యముడు. పన్నెండు సంవత్సరాల వయస్సు వచ్చే వరకూ మానవుడికి ధర్మాధర్మ వివేకం ఉండదు. కనుక అంతవరకూ వాడేది చేసినా అధర్మం కాదు. అయినా ఆ స్వల్పాపరాధానికి తీవ్ర దండన విధించావు. సర్వ ప్రాణి వధకంటె బ్రహ్మహత్య మహా భయంకరమైనది ఆ పాతకానికి నువ్వు వడికట్టావు కనుక తత్ఫలితంగా శూద్రయోనిలో జన్మించు. అని శపించి - పదునాలుగు సంవత్సరాల వయస్సు ప్రాప్తించేవరకూ మానవప్రాణి చేసే పాపానికి ఆ ప్రాణికి బాధ్యత లేదు. ఇది నా శాసనం - అని అణీ మాండవ్యుడు వెళ్లిపోయాడు ఈ శాపంవల్లనే యమధర్మరాజు వ్యాసుడి ద్వారా శూద్రదాసికి విదురుడుగా జన్మించాడు. వ్యాసుని అనుగ్రహం వల్ల జన్మించిన విదురుడు ధర్మార్థశాస్త్ర విదురుడు, లోభ, క్రోధ రహితుడు, సత్యవ్రతుడు, దూరదృష్టి సంపన్నుడు, మితభాషి

విదురుడు దేవతా తేజస్వియై కురువంశ ప్రవర్ధకుడయ్యాడు.



( ఛాందోగ్యోపనిషత్తు )

# తగవు

సి. వేదవతి

ఏ కారణం చేతనయినా మనుష్యులు తమలో తాము పోట్లాడుకోవటం మనం ఎరుగుదుం. కాని, ఇంద్రియాలు ఒకదానితో ఒకటి పనిగట్టుకుని తగవు పెట్టుకోవటం ఎంత విచిత్రం ! చిత్రమైన ఈ కథను ఛాందోగ్య ఉపనిషత్తు చెపుతున్నది.

ఒకసారి ఇంద్రియాలన్నీ నేను గొప్ప అంటే నేను గొప్ప అంటూ తమలో తాము తగవు పడ్డాయి ఎంతకూ తెగక - చివరకు అవి తమ జన్మకు కారణభూతుడైన ప్రజాపతి వద్దకు వెళ్ళి - తమలో ఎవరు అధికులో తీర్పు చెప్పవలసిందని అడిగినాయి

ప్రజాపతి నవ్వుకొని ఇట్లా అన్నాడు - " ఓ ఇంద్రియములారా ! మీలో ఎవరు లేకపోయినట్లయితే శరీరం ఎందుకూ పనికిరాకుండా పోతుందో అదే అన్నిటికన్నా శ్రేష్ఠమైనదిగా తెలుసుకోండి "

ఆ మాట విని ఇంద్రియాలు తమలో తాము పరీక్ష పెట్టుకొన్నాయి వరుసగా శరీరం నుండి తప్పుకొనటం ప్రారంభించాయి.

ముందుగా వాక్కు శరీరం నుండి తనకుతాను ఉపసంహరించుకొన్నది ఒక సంవత్సరం తర్వాత తిరిగి వచ్చి - "నేను లేకుండా మీరు శరీరంలో ఎట్లా ఉండగలిగారు ? " అని ప్రశ్నించింది,

" నీవు లేకపోవటం వల్ల శరీరానికి మూగతనం వచ్చింది మాట రాని లోపమే తప్ప మిగతా ఇంద్రియాలన్నీ యథావిధిగా సాగిపోతున్నాయి. కన్నులు చూడటం, చెవులు వినటం మానలేదు ఆలోచనాశక్తి ఏమీ తగ్గలేదు మేమంతా ఎప్పటివలె ఉన్నాము " అంటూ ఇంద్రియాలు జవాబు చెప్పాయి

అప్పుడు వాక్కు మళ్ళా శరీరంలో ప్రవేశించింది.

తరువాత దృష్టి శరీరంనుండి విడిపోయి ఒక వత్సర కాలం బయటే ఉండిపోయింది ఏడాది తర్వాత తిరిగి వచ్చి - ఇంద్రియాలతో " మీరంతా నేను లేకుండా ఎట్లా ఉన్నారు ? " అని అడిగింది.

"నువ్వు లేనందువల్ల శరీరానికి చూపు పోయింది కళ్లు చీకట్లు అయినా శరీరం మామూలుగానే ఉంది. ప్రాణం ఆడుతున్నది. మాట్లాడుతూ శబ్దాలనువింటూఉన్నది శరీరం. ఆలోచిస్తూనూ ఉన్నది " - అన్నాయి ఇంద్రియాలు.

దృష్టి మాట్లాడకుండా శరీరంలోకి వచ్చి చేరిపోయింది.

ఆ తర్వాత శ్రవణశక్తి బయటకు వెళ్ళిపోయింది. అదికూడా సరిగ్గా సంవత్సరం తర్వాత తిరిగి వచ్చి మిగతా ఇంద్రియాలను అదే ప్రశ్న వేసింది.

" ఓ శ్రవణేంద్రియమా ! నీవు లేకపోవటంవలన శరీరానికి చెవుడు వచ్చింది. అంతేతప్ప, చూడటం, మాట్లాడటం, ఆలోచించటం వగైరా కార్యక్రమాలన్నీ మామూలుగానే జరిగిపోతున్నవి " ఇంద్రియాల మాటలు వింటూనే శ్రవణశక్తి వచ్చి శరీరంలో చేరిపోయింది.

తర్వాత మనస్సుకూడా బయటికి వెళ్ళి ఒక సంవత్సరం తర్వాత తిరిగి వచ్చి - " మీరంతా ఎట్లా ఉన్నారని " ఇంద్రియాలను అడిగింది.

" పసివాళ్ళకుమల్లే ఆలోచన లేకుండా ఉన్నదన్నమాటే కాని, శరీరం జీవించే ఉన్నది. వాక్కు, దృష్టి, శ్రవణశక్తి, - అన్నీ యథాతథంగా ఉన్నాయి " ఇంద్రియాలు ఇట్లా అనేటప్పటికి మనస్సు వచ్చి శరీరంలో చేరిపోయింది.

చివరకు శరీరాన్ని విడిచి పోవటానికి సంసిద్ధమైనది ప్రాణం. అప్పుడది అన్ని ఇంద్రియాలతోటీ బంధనాలు త్రెంచుకొని పోతున్నట్లయింది ప్రాణం వెళ్లిపోతే తమ పని అయిపోతుందని తెలిసి ఇంద్రియాలన్నీ భయపడిపోయినాయి.

" ఓ ప్రాణమా ! నీవు శరీరం నుండి నిష్క్రమించవద్దు. నీవే లేకపోతే మాకు ఉనికిలేదు. మా అందరిలోకీ నీవే సర్వశ్రేష్ఠుడివని అంగీకరిస్తున్నాం నీవు శరీరంలో ఉండి మా అందరినీ సజీవంగా ఉండేట్లు చేయి ! " .... అని ఇంద్రియాలు ప్రాణాన్ని వేడుకొన్నాయి

ప్రాణవంతములైనప్పుడే ఇంద్రియాలు పని చేస్తాయి. అన్నిటికన్నా విశిష్టమైనది - సుప్రతిష్ఠమైనది — ప్రాణమే- అన్న సత్యం ఇంద్రియాలకు తెలిసివచ్చింది. అంతటితో వాటి తగవూ తీరిపోయింది.

★★

# బాసతో వచ్చిన బాసు (కథ)

మంతెన సూర్యనారాయణరాజు

లోకం మరచిపోయి మద్రాసు నగర సౌందర్యాన్ని ఆస్వాదిస్తూ సినిమా వాల్‌పోష్టర్లని, మేడల్ని చూస్తూ గతిపేస్తున్న నిసలైన శ్రీకాకుళం జిల్లా మనిషి పదహారణాల తెలుగువాడు అప్పికట్ల అప్పారావుని ఒక తమిళ సోదరుడు దారంటే పోతూ "మణి ఎన్నంగో" అంటూ అడిగాడు.

వెంటనే ఉలిక్కిపడి ప్రక్కకు చూసి వాడు పైమడుగుతున్నాడనే విషయం అర్థంకాక "ఏటంతన్నావ్" అన్నాడు.

"మణి ఎన్నంగో" అంటూ అప్పారావు ముఖంవైపు అదేపనిగా చూస్తున్నా డా తమిళుడు.

పైనున్న లాడ్జి ఫస్టుఫ్లోరులో నుంచి సిగరెట్ కాలుస్తూ నెల్లూరుకు చెందిన రమణారెడ్డి వాళ్లిద్దర్నీ అబ్జర్వ్ చేస్తున్నాడు తెలుగువాళ్ళు తమిళులూ చాలాకాలం ఒకే రాష్ట్రంలో ఏకోదరులుగా కాలక్షేపం చేసినా నేడు విడిపోయినంతమాత్రం చేత కూడా భాషాపరమైన ఇబ్బంది మాత్రం పోలేదనే చెప్పాలి అదీగాక ఒకర్నొకరు మోసం చేసుకోవటమూ మానలేదు

అప్పారావు ఆ అడ్డపంచెకట్టు మనిషిని ఎగాదిగా చూసి "మణేంటి ?" అంటూ ఎదురు ప్రశ్న వేశాడు అప్పుడా తమిళుడు వాచీకేసి చూపించాడు. ఈ మాత్రం గ్రహించలేకపోయాననే తన మూర్ఖత్వాన్ని తిట్టుకుంటూ అప్పారావు "ఓసోసి అదా ! పన్నెండు గంటలు" అన్నాడు మళ్ళీ ప్రక్కనున్న సిల్కుస్మిత వాల్‌పోస్టర్ చూడ్డంలో లీనమైపోయాడు అప్పారావు. రమణారెడ్డి వాళ్ళవైపే మార్చిమార్చి ఏం జరుగుతుందోనని చూస్తున్నాడు

పైమడిగిన ఆసామి అప్పటికీ వదలలేదు. ఈసారి అతగాడు "పన్నెండూ పన్నెండూ ఎందా" అని అడిగాడు. అప్పారావుకి చిర్రెత్తుకొచ్చింది. ముఖం చిట్లించి "నువ్వింకా ఎల్లిపోలేదేటి" అన్నాడు.

"పన్నెండూ పన్నెండూ ఎంత సామీ ?" అడిగాడా తమిళుడు వచ్చీరాని తెలుగులో.

"ఓర్నీ .. నీకు తెలుగొచ్చునన్నమాట" అంటూ సంబరపడిపోతూ "ఇరవైనాలుగు. ఆమాత్రం తెల్దేటి?" అంటూ స్మితారాధనలో లీనమయ్యాడు.

"ఇరువత్తినాలుగు ఇరువత్తినాలుగు ఎంద ?" అడిగాడు మళ్ళీ.

"ఇదుగో ఇందాకట్నుంచి సూత్తన్నాను. నీకు మరో పనీపాటా లేనట్టుంది. ఎల్లెహే !" అంటూ గసిరాడు అప్పారావు. అతగాడు వెళ్లలేదు సరిగదా మరింత దగ్గరకెళ్ళి తట్టుతూ "చెప్పు సామీ" అంటూ వత్తిడి చేశాడు.

"అదీ తెల్దా ! నలభైఎనిమిది. ఈసారడిగావంటే నీ నాలిక కత్తిరించేస్తా" అంటూ స్మిత వాల్‌పోస్టర్‌వైపు చూస్తూ వుండిపోయాడు.

" నల్భై ఎనిమిద్‌కి ఇరండు కలిపితే ఎంద సామీ " అంటూ ఆ తమిళుడు మళ్లా అడిగాడు అప్పారావుని. అప్పారావుకి అరికాలిమంట నెత్తికెక్కింది. జవాబు చెప్పనేలేదు.

రమణారెడ్డి బోయ్ చేత చెయిర్ తెప్పించుకుని పిట్టగోడ దగ్గర వేయించుకుని కాఫీ తెప్పించుకుని తాగి, సిగరెట్ వెలిగించి క్రింద జరుగుతున్న దృశ్యాన్ని చూస్తూ కూర్చున్నాడు. చూడబోతే ఆ తమిళుడు అప్పారావుని బుట్టలో పెట్టి మోసం చేసేలా వున్నట్టు అనిపించింది ఇతగాడేం చేస్తాడో వేచి చూడాలని అక్కడే తిష్ఠ వేశాడు రమణారెడ్డి.

కాస్త చనువైనట్టుగా ఈనారి అప్పారావు భుజంమ్మీద కొడుతూ "నల్భైఎనిమిద్‌కి ఇరండు కలిపితే ఎంద ?" అంటూ అడిగాడు. వీడి పీడ విరగడయ్యేలా లేదని కాస్తంత దూరం వెళ్ళి నిలబడ్డాడు. అయినా అతగాడు ససేమిరా వదిలితేనా, తనూ దగ్గరకెళ్లాడు. మళ్లీ అదే అడిగాడు ఇప్పుడైనా వదిలేస్తాడేమోనని " ఏభై " అంటూ కోపంగా అరిచాడు అప్పారావు.

" అయితే నా యాభై నా కిచ్చేయ్ ! " అన్నాడా తమిళుడు.

అప్పారావుకి మతిపోయింది 'ఇదేం గాచారంరా దేవుడా ! లేసి ఎవళ్ళ మొగం సూసానో. ఈడికి సైమ డిగితే సెప్పినందుకా నాకీ సిచ్చ' అనుకుంటూ జారుకోబోయాడు వాడు అప్పారావుని కాలరు పట్టుకుని ఆపి నాకితను ఏభై రూపాయలివ్వాలని తమిళంలో వచ్చే పోయే వాళ్ళతో అందరూ వినేలా చెబుతున్నాడు పెద్దగా తిడుతున్నాడు. జనం పోగవుతున్నారు.

ఈ ఘోరకలి చూస్తూ ఊరుకోకూడదని రమణారెడ్డి గదిలోకెళ్ళి షర్టు వేసుకుని రూమ్ లాక్ చేసి రోడ్డుమీదికొచ్చాడు. అప్పారావు చుట్టూ జనం మూగిపోయారు. అప్పారావుకసలు తమిళం రాదు. ఏడుపుగొట్టు ముఖంతో అప్పుడే అక్కడికొచ్చిన కానిస్టేబుల్‌తో " మాది సికాకుళవండీ " అంటూ జరిగింది చెప్పుతున్నాడు. అది

## విశ్వవృక్షం

అది చెట్టు
ఆ చెట్టు వంటుకు
బతికే
ఆకులు కోటాను కోట్లు.
గాలి
సోకినపుడల్లా
పోట్లాడు కుంటాయి
కాట్లాడు కుంటాయి
వాటి మధ్య నున్న
పూలు దెబ్బతింటాయి.
వాతావరణం
స్తంభించగానే
ఆకులు
మామూలుగా
మౌనం ధరిస్తాయి.
చెట్టు
శాంతినే కోరుకొంటుంది
కానీ
దాని ఆకుల కలకలానికి
తానూ ఊగిపోక తప్పడంలేదు.

— ఉమ్మెటి విఘ్నేశ్వరరావు

## అక్షరాలయం!

మనస్సెప్పుడూ మంచి చెడు ఘర్షణల
కురుక్షేత్ర "భారతం"
హృదయం అప్పుడప్పుడూ
భక్తి భావ భరిత "భాగవతం"
శరీరం నిలిచే వరకూ
ధర్మ సాధన రూప "రామాయణం"
అయితే,
ప్రపంచ ప్రకృతి మాత్రం
కళ తప్పని "పంచతంత్రం"
తిరిగే కాలచక్రం
శాసించే "వేదనాదం"
ఆలోచిస్తే —
అంతా అక్షరాలయం!

— రామడుగు వెంకటేశ్వరశర్మ

అతగాడికి అర్థం కాలేదు. జనాన్ని తోసుకొచ్చి రమణారెడ్డి కానిస్టేబుల్‌తో తాను చూసినవన్నీ భోగట్టా పూస గుచ్చి నట్లు అంతా తమిళంలో విడమరచి చెప్పాడు

అప్పారావుని టైమ్ అడిగిన తమిళుడు కాదని బుకాయిస్తున్నాడు. కానిస్టేబుల్ లాఠీతో వాడిని నాలుగు వాయించాడు. రమణారెడ్డి "వీడిని లాకప్‌లో పెట్టి వుంచండి నే నొచ్చి కేస్ ఫిర్యాదు వ్రాసిస్తాను" అని తమిళంలో చెప్పాడు. అప్పారావుకిదంతా ఏదో సిన్మా చూస్తున్నట్లు అనిపించిది. కానిస్టేబుల్ "పరవాయిల్లసార్, అవిదా నాన్ పారింగె "(అవి నేను చూస్తా) అంటూ వాడిని ముందుకు నెట్టుకుంటూ అక్కణ్ణుంచి తీసుకు చక్కాపోయాడు.

ఆ క్షణంలో అప్పారావుకి రమణారెడ్డి ఒక దేవుడిలా వచ్చి కాపాడాడని దగ్గరకెళ్ళి తెలుగులో కృతజ్ఞతలు తెలుపుకున్నాడు రెడ్డి నేనిదంతా మేడ మీంచి చూస్తున్న కారణంగా తెలిసింది. లేకపోతే వాడు మిమ్మల్ని మోసం చేసేవాడు అన్నాడు "ఎల్లొస్తాను" అని చెప్పి బ్రతుకు జీవుడా అనుకుంటూ తన చుట్టాలింటివైపుపోయే బస్సు స్టాప్ దగ్గరకెళ్ళి నిలబడ్డాడు. భాష రాకపోతే ఏ రాష్ట్రానికి వెళ్ళినా ఇటువంటి అనుకోని ఇబ్బందులెదురై అభాసుపాలయ్యే అవకాశం లేకపోలేదు

# వెనక్కి నడిచే మనిషి

## మనకు తెలియని ప్రపంచం

మల్లాది వెంకటకృష్ణమూర్తి

అమెరికాకి చెందిన ప్లెన్నవింగో అనే వ్యక్తి సంపాదన విచిత్రమయిన విద్యతో కూడుకున్నది. అది ప్రపంచంలోని అనేక ప్రదేశాలలో నడవడం. అయితే అందరిలా ముందుకు నడవడు వెనక్కి నడవడం ద్వారా.

ఏప్రియల్ 15, 1931. వింగోకి ఓ భార్య, ఓ కూతురు. అష్ట దరిద్రం ఉండేవి. నాలుగు రాళ్ళు సంపాదించాలనే ధ్యేయంతో ఆ రోజు టెక్సాస్ నించి వెనక్కి నడవాలనే ధ్యేయంతో ఆ రోజు వెనకాల ఏముందో చూసుకోవడానికి రెండు రివర్ ట్రా అద్దాలే అతనికి ఆధారం. ఆ విధంగా రోజుకి 35 మైళ్ళు నడవగలిగేవాడు

తన ఫోటోతో పోస్టుకార్డ్ ముద్రించి వాటిని 25 సెంట్లకి అమ్మేవాడు ఆ వింత వ్యక్తి పోస్టుకార్డ్సు అమ్మకాల ద్వారా కొంత రాబడి వచ్చేది. ఏదైన నగరం చేరుకుంటే, వింగోని తమ ప్రకటనలకోసం వ్యాపార సంస్థలు వాడుకొని ఎంతోకొంత రుసుము చెల్లించేవి. అంతేకాదు పడుకోడానికి ఉచితంగా చోటు భోజనం కూడ ప్రజలతనికి ఇచ్చేవారు దాంతో ఖర్చు లేని రాబడి లభించేది. ఎప్పటికప్పుడు ఆ డబ్బుని తన భార్యకి పంపిస్తూండేవాడు

అతని భుక్తికోసం మొదలు పెట్టిన ఈ వెనక నడక 'గిన్నీస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్సు' లో కూడ అతనికి ఓ స్థానాన్ని సంపాదించి పెట్టింది. కొత్తల్లో వెనకాల రోడ్డు కనబడే అద్దాలున్నా, ఓసారి పేవ్‌మెంట్ మీద కిందపడి అరి పాదం పైన ఎముక విరిగింది.

యూరోపులోని వివిధ దేశాల్లో సరిహద్దులు దాటేప్పుడు ప్రభుత్వోద్యోగులతో అనేకఇబ్బందులు ఎదుర్కొన్నాడు. ఆసియా ఖండానికి చేరుకున్నాక వింగోకి ఎదురయినన్ని సమస్యలు మరెక్కడా ఎదురవలేదు 'వెనక్కి నడవడం ఏమిటో' చాలామంది ప్రభుత్వోద్యోగులకి అర్థం కాలేదు. ప్రజలకి కూడ. అతని రాబడి తగ్గిపోవడంతో, ఆసియా నుంచి న్యూయార్క్‌కి వెళ్ళే ఓడ ఎక్కేసాడు. అక్కడ నించి మళ్ళీ టెక్సాస్‌కి నడవడం ప్రారంభించాడు. మొత్తం 8,000 మైళ్ళు నడకని పూర్తి చేశాడు, తిరిగి చేరుకునే సరికి.

ఈ ప్రయాణంలో 13 జతల బూట్లు తొడుక్కున్నాడు. అతని భార్య అతను ఇంటికి రాగానే 'విడాకులి' చ్చేసింది. మళ్ళా నడక సాగించాడు. దారిలో జుమాంటియ అనే అమ్మాయితో ప్రేమలో పడ్డాడు. ఆమెని వివాహం చేసుకున్నాడు

ఇప్పుడాయన వయసు81 ఇదివరకటిలా వుత్సాహంగా చాలా దూరం నడవకపోయినా, అప్పుడప్పుడు వ్యాపార ప్రకటన సంస్థలకోసం నడుస్తూనేఉన్నాడు. ఈ మధ్యే సెంటామోనిక నించి సేన్‌ఫ్రేన్సిస్కోకి 450 మైళ్ళు నడిచాడు. 

# స్వీకారం

" తియ్యని పాటల తిరుప్పావై "
వెల : రు. 15-00

" అర్చన " వెల : రు. 10-00

" నారద భక్తి దర్శనం "
వెల : రు. 25-00

రచయిత : " శాంతిశ్రీ "
శ్రీ జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి
ప్రతులకు : శ్రీ జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి
పి. సి 9, ప్రశాంతినిలయం. 515134
అనంతపూర్ జిల్లా

" సాయిమురళి "
1, 2, 3, 4 భాగములు
రచయిత : చెరుకూరి లక్ష్మీకాంతమ్మ
ఎలమర్రు, కృష్ణాజిల్లా.

" శ్రీ సాయిగీత "
రచయిత : విద్యానందం
ప్రతులకు : కుటాల చెర్వుపల్లి, నల్లమాడ మండలం
అనంతపురంజిల్లా.

" చిట్టగాంగ్ వీరగాధ " వెల : 3-00
రచయిత : శ్రీ ఆనంద ప్రసాదగుప్త

" కథాకల్పతరువు " వెల : 3-00
( శ్రీ గురూజీ చెప్పిన కథలు )
అనువాదం · శ్రీ కె శ్రీనివాసమూర్తి

" వర్ణాంతర వివాహాలు " వెల : 3-00
రచయిత : ' కస్తూరి '
ప్రతులకు : సాహిత్య నికేతన్, ఏలూరురోడ్,
విజయవాడ - 2
సాహిత్యనికేతన్, 3-4-852 బర్కత్‌పూర
హైద్రాబాద్ - 500 027

## శ్రీ వాణీ !

' శ్రీవాణీ ! ' కలభాషిణీ !
కవిమనశ్శ్రీచక్ర సంచారిణీ !
భావాలోకన దాయినీ ! రసధునీ !
పాండిత్య మందాకినీ !
దేవా నీకనుతాంఘ్రి పద్మయుగళా !
దేవీ ! కళా ! మంగళా
రావే ! సాయి సరస్వతీ ! భగవతీ !
ప్రార్థింతు నశ్రాంతమున్.

— శాంతిశ్రీ

" రేపటి వేకువ కోసం " వెల : రు. 8-00
( వచన కవితాసంపుటి )
రచయిత : కృష్ణస్వామి
ప్రతులకు : శ్రీమతి యం. కృష్ణకుమారి
C/o కె హరిహరస్వామి ఇల్లు
కాలేజీ రోడ్, అమలాపురం

" ఆరోగ్యము - ఆయుర్వృద్ధి "
రచయిత : డా॥ తిరుపూరు మధుసూదనరావు
ప్రతులకు : డా॥ తిరుపూరు మధుసూదనరావు
వైద్యవిద్వాన్, నూజివీడు

" ప్రసంగ తరంగిణి " వెల : రు. 15-00
రచయిత : శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి
ప్రతులకు : " కళాప్రపూర్ణ "
శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి
లలితానగర్, రాజమండ్రి -5

" సీతాయనము " వెల : రు. 8-00
(పద్యకావ్యము)
రచయిత్రి : వేదుల మీనాక్షీదేవి
ప్రతులకు : వేదుల మీనాక్షీదేవి, రాజమండ్రి

# అభిప్రాయవేదిక

"ప్రశాంతినిలయంలో . తొమ్మిది రోజుల మీ అనుభవాలు వ్యాసం ఎంతో స్ఫూర్తిదాయకంగా ఉంది. దేవీ నవరాత్రులకు ఎంతటి ప్రాముఖ్యత ఉన్నదో, శ్రీ బాబాగారి సన్నిధిలో వున్న ఆ తొమ్మిది రోజులకు అంతకంటే ఎక్కువ ప్రాధాన్యత ఉన్నదని నా భావన. శ్రీ బాబాగారి అనుగ్రహంతో 'శ్రీవాణి' పక్ష పత్రికే కాదు, వార పత్రిక కూడా అవుతుంది. ఏమాత్రం సందేహం లేదు"

— ఆర్. యస్. కాంతారావు, విజయవాడ

"శ్రీ చంద్రశేఖరశర్మగారు అందిస్తున్న 'అమృతవాణి' అమోఘం. రచనలన్నీ ఉత్తమ భావ గర్భితములై, ఆధ్యాత్మిక సాహిత్య తత్వ జిజ్ఞాసువులకు మనోజ్ఞమైన ఆమెతను గూర్చె ననుటలో సందేయం లేదు"

— గుడ్లదొన శ్రీనివాసరావు, నాగార్జునసాగర్

"సాయిబాబావారి దివ్య సందేశాలు శ్రీవాణి ద్వారా పాఠకులకు అందిస్తున్నందుకు అభినందనలు. శ్రీవాణి పత్రిక నేటి పత్రికలలో అగ్రస్థానమును ఆక్రమించి, సాహిత్య ప్రపంచంలో గణనీయమైన సేవను చేస్తున్నదనడంలో ఏమాత్రం సందేహం లేదు"

— పంగనామముల రామమోహనరావు,
సికింద్రాబాద్

"శ్రీవాణి ప్రత్యేక సంచికను చాలా బాగా రూపొందించారు ప్రతి నెలా అమూల్యమైన విషయాలనందిస్తూ శ్రీవాణి తన ప్రత్యేకతను చాటుతున్నది. భగవాన్ శ్రీ సత్యసాయిబాబాగారి దయవల్ల శ్రీవాణిని యింకా ఎంతో ముందుకు తీసుకొని రాగలరని ఆశిస్తున్నాను."

— లింగం కామేశ్వరరావు, అలహాబాద్

"స్వీయ సంస్కృతీ సంప్రదాయ పరిరక్షణద్వారా జాతీయ ఔన్నత్యాన్ని నిలిపే ప్రయత్నం చేస్తున్న మీ కృషి ప్రశంసనీయం. పత్రికారంగానికే తలమానికం "శ్రీవాణి""

— మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి,
బాపట్ల

"ప్రశాంతి నిలయంలో మీ అనుభవాలు చదువుతూంటే మా హృదయాలు ఎంతో ఆనందంతో పొంగిపోవుచున్నవి"

— గుంటూరు వరశింహారావు, సూర్యాపేట

"రాజకీయవాదిగా రాజకీయ రంగంలో మంచి పేరును గడించిన మీరు — పూర్వజన్మ సుకృతంవల్ల — ఆధ్యాత్మిక వాదిగా మారటం — అనతికాలంలోనే భగవాన్ శ్రీ సత్య సాయిబాబావారి కరుణకు పాత్రులు కావటం — బాబావారి ఆశీస్సులుపొంది 'శ్రీవాణి' ని నైతిక విలువలతో నింపిన ఆధ్యాత్మిక పత్రికల శ్రేణిలో అనతికాలంలోనే నడపగల్గిన మీ కృషి శ్లాఘనీయం. శ్రీ బాబావారి దివ్య కరుణామృతాన్ని పొందగలిగిన మీరు ధన్యులు."

— పి. రామచంద్రరావు, నూజివీడు

"శ్రీవాణి లో మీ అనుభవాలు చదువుతున్నాను. అది మీ అపూర్వమైన సుకృతం, తపఃఫలం. అందరికీ ఆ అదృష్టం అబ్బదు 1·80 నుంచీ నేను దాదాపుగా 8 సార్లు పుట్టపర్తి వెళ్లాను. ఆ దివ్య తేజస్విత కరుణా మూర్తి దర్శనభాగ్యం ఈ జన్మలో కొందరు చేసుకున్న సుకృతం."

— బి. యస్. ఆర్. కృష్ణారావు (హరికిషన్)
విజయవాడ

Postal Registered
No. H/MPM/34, Dt. 10-12-84

SREE VANI

Regd. with Registrar of News Papers
No. RN 000121/20/AL/85 NT III

శు భా కాం క్ష ల తో

# లక్ష్మి జనరల్ స్టోర్స్

బిసెంటురోడ్.....గవర్నరుపేట
విజయవాడ-2

## ఫ్యాషన్ వస్త్రముల సప్లయిదారులు

